# ఇదీ మన సంస్కృతి!
# ఇదీ మన సంప్రదాయం!



కర్త

డా॥ మోపిదేవి కృష్ణస్వామి

ఎం. ఎ. పి. హెచ్. డి.

కూర్పు

శ్రీ కందర్ప రామచంద్రరావు

ప్రచురణ

ది యూనివర్సల్

హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్ట్

ప్రథమ ముద్రణ :
మేకాల్ గురుపూజలు - 1989
విజయవాడ

ప్రతులు : మూడు వేలు



వెల : 10/-

ప్రతులకు :
ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్ట్

16-8-1
అఫీషియల్ కాలనీ
మహారాణి పేట
విశాఖపట్నం-2

23-10-7
పురుషోత్తం వీధి
సత్యనారాయణపురం
విజయవాడ-11

ముద్రణ : విక్టరీ ప్రెస్, విజయవాడ-1
ముఖపత్ర రూపకల్పన : బాలి

# సమర్పణ

జన్మ నిచ్చిన తల్లిదండ్రులు

ప్రత్యక్ష దైవ స్వరూపులు

**శ్రీ మోపిదేవి రామచంద్రరాయశర్మ**

**శ్రీమతి హైమవతమ్మ**

**గార్లకు**

పాదాభి వందనములతో

# ఇందులో

# వెలుగులు విరజిమ్ముతున్నారు.

నేటి మనిషి నవ్వలేక పోతున్నాడు. నిప్పులు కక్కుతున్నాడు. తెలుసుకోలేక నిప్పులే మింగుతున్నాడు. శిఖరాలేవో అధిరోహిస్తున్నా ననుకుని చీకటి లోతుల్లోకి పడిపోతున్నాడు. పెంచుకున్న మేధ దారి చూపించక అరణ్యాల్లోకి పోతున్నాడు. విజ్ఞానం, పరిశోధన, అన్వేషణ, తర్కం—ఇవేవీ అందివ్వలేని తనకు దక్కని ఒకానొక శాంతి కోసం మనిషి ఆత్మాహుతి చేసుకుంటున్నాడు.

నిత్యం, అనుక్షణం పడగ విప్పే కొత్త కొత్త సర్పాలు, కొత్త కొత్త ప్రశ్నలు సంధిస్తే క్షణాల్లో భూగోళాన్ని చుట్టి రాగల క్షిపణుల్ని పిచ్చుకల్లా ప్రయోగించే శాస్త్రజ్ఞాన బృహస్పతి కాగలిగిన ఆధునిక మానవుడికి అడుగడుగునా భయం భరోసా, మృగ్యం.

సంశయాంధకార సంవృతుడు నేటి మనిషికి మరి ఏది దారి? ఏది వెలుగు? ఎటు? ఎక్కడ? అడుగు ఎటు వెయ్యాలి?

ఎన్ని మతాలు! ఎన్ని ప్రబోధాలు! ఎన్ని ప్రవచనాలు ... అయినా ఏది శాంతి? మతంలేని నాస్తిక జనాభి మతంలోనా? అక్కడైనా ఉందా శాంతి?

మతం లేని చోటే శాంతి ఉంటే పృథ్వీమీద పుట్టిన మతాలు మరి ఇంత కాలం గోపురాల్లో కాపురం చేసేవా?

మతమూ కాదనుకుంటే ఏదీ మార్గం?

కాదు మతమే మార్గం అనుకుంటే ఏది మంచి మతం? ఏది మార్గం? ఎవరు మార్గదర్శకులు? ఎవరు? అసలు మతం అంటే ఏమిటి? ఇవన్నీ నేటికీ ప్రశ్నలే...

కాగా...

అంతా అనుకోవడంలో ఉందన్నారు కొందరు. ఎలా అనుకోవాలో ఏమనుకోవాలో చెప్పేవారు కొందరే. ఆ కొందరిలో శ్రీ మోపిదేవి కృష్ణస్వామి ఒకరు—

అన్ని మతాల పట్ల అవగాహన ఉన్న వ్యక్తి ఆయన. జనహితం ఆయన మార్గం.

మన మతాల్లో ఆధి భౌతిక సంకేతాలు కొన్ని. ఆధి వాస్తవిక సంకేతాలు కొన్ని. మనిషిని మరో అడవిలోకి తీసుకు పోకుండా సూటిగా తెలియజెప్పే ప్రజ్ఞ కావాలి.

"మోక్షం అంటే భవిష్యత్తు అంటే భయం తొలగి పోవడమే" అని ఆయన నిర్వచనం. నేను సవ్యంగా ఉంటే నేటికి మోక్షం వచ్చినట్లే కాదా. అయః పిండం లాంటి శబ్దానికి స్వామిగారు ఇచ్చిన సమన్వయం సరళంగానే ఉందికదా.

ఈ ప్రపంచంలో ఏది వాంఛనీయం? ఏది తపో మార్గం? అన్న మరో జటిల ప్రశ్న ఎదురవుతుంది. ఆమాటే అడిగితే, ఈ సృష్టిలో దేనినీ కోరనక్కర లేదు. దేనినీ వదల నవసరం లేదు. తపస్సు స్వరూపంగా మనం నిరంతరం స్వీకరించవచ్చు. వివాహం, బిడ్డలను పెంచడం, వృత్తి వ్యాపారాలు అన్నీ తపస్సులే" అంటారాయన. మనిషికి ఈ వెలుగు చాలు కదా.

మరో ఘట్టంలో... మరో ప్రసంగంలో కృష్ణావతార సందేశాన్ని విశ్లేషించే సందర్భంలో మృత్యువుని గురించి స్వామిగారు అన్న మాటలు వినండి—

"మృత్యువులో కూడా ఒక ప్రయోజనం ఉంది. ఒక సాంత్వనం ఉంది. ఒక జవాబు ఉంది. వ్యర్థమైన సన్నివేశం ఏదీ లేదు. మన ముఖాల్లో నీరసం, విషాదం, టెన్షన్, ఒత్తిడి కనబడ కూడదు. బాధలు, బరువులూ, నిస్పృహలూ, నిట్టూర్పులూ కనబడ కూడదు. మృత్యువు కోరల మధ్య ఆది నుండి అంతం వరకు చిరునవ్వుతో వేణుగానంతో సాగిపోవాలి. అదే కృష్ణావతార సందేశం" బాల్యం నుంచి అవతార సమాప్తి వరకు నవ్వుతూ బ్రతికిన కృష్ణుడి సందేశం 'నవ్వుతూ బ్రతుకు నాయనా' అనే అంటారాయన. బావుంది.

ఇలాగే దక్షుడు ఎవరో కాదు, దైవానికీ, దేహానికీ మధ్య పుట్టుకు వచ్చిన అహంకార స్వరూపుడే అని ఓ చక్కని అన్వయం కుదిర్చారు స్వామిగారు. అటువంటి ఘట్టాల్ని సంకేతాలుగా స్వీకరిస్తే సందేశం అర్థమవుతుంది. నిజమే.

మనిషిని మనిషిగా మలచి ప్రాణం పోసే ఉపాధ్యాయుడికి స్వామిగారు రెండు సూచనలు చేస్తున్నారు. 'మొదటిది పరీక్ష అనేదీ గుర్తు రాకుండా పాఠం చెప్పాలి. రెండవది మన జీవితం విద్యకు ప్రేరణ ఇచ్చే విధంగా మనం దానిని మలచుకోవాలి. అంతకన్న మన జీవితాలకు ధన్యత లేదు.' మనం "తగు తయారీ" లేకుండా "తగు శిక్షణ" లేకుండా బ్రతుకు తున్నాం కాబట్టే నిత్యం రకరకాల సందర్భాలలో చిక్కుకుంటున్నామని ఆయన అభిప్రాయం. మనకున్న బోధనా వ్యవస్థ మీద స్వామిగారి వంటి వ్యక్తులకు అటువంటి అభిప్రాయం కలగడం సహజమే.

ఈ సందర్భంలో నేను వినమ్రంగా చెప్పదలచింది ఒక్కటే—

ఈ భూమి పుట్టిన తర్వాత ఈ భూమి మీద మేధ వికసించడం ఆరంభించిన తర్వాత నేటి వరకు నిశ్శేషంగా ప్రతి విషయాన్ని గురించి ఎవరో ఒకరు ఏదో ఒక రూపంలో ఏదో ఒక సందర్భంలో ఏదో ఒక చోట చెప్పేశారు. ఇపుడు ఎవరూ సరికొత్తగా ఏదీ చెప్పవలసిన పని లేదు. ఎలా చెబుతున్నారన్నదే ముఖ్యం. ఒక్కసారి వెనుతిరిగి దుమ్ము దులుపుకుని వెలుగులు చూసుకోలేని వారి కోసం స్వామిగారు దుమ్ము దులిపి వెలుగులు విరజిమ్ముతున్నారు. అటు చూడాలి.

చివరగా మరొక్క మాట శ్రీ కృష్ణస్వామిగారి ప్రసంగాలన్నింటినీ ముద్రణకు నివేదించడంలో వాక్యాలకు అందమైన దుస్తులు తొడిగిన శ్రీ కందర్ప రామచంద్రరావు గారికి అభినందన.

విజయవాడ
24-5-89

వి. వి. దీక్షితులు
డిప్యూటీ ఎడిటర్, ఆంధ్రపత్రిక

# సింహద్వారం తెరువబడ్డది

ఇది ఒక విలక్షణమైన సంకలనం. ప్రవచనాల సారాంశాల సంకలనం.

మానవ ధర్మ శిక్షణ సంస్థ వ్యవస్థాపకులు డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామి గత సంవత్సరం వివిధ సమయాలలో, వివిధ వేదికలపై ఇచ్చిన ప్రవచనాలు భారతీయ సంస్కృతికీ, సాంప్రదాయానికీ అద్దం పట్టాయి. ఆయా పర్వదినాల వెనుక గల ఆధ్యాత్మిక సత్యాలను, ఆయన విశ్లేషించారు. సృష్టి రహస్యాలను వెలికి తీశారు. మన దేవతలకు, పురాణ గాథలకు, ఆర్ష విజ్ఞానానికి సంబంధించి ఎన్నెన్నో కొత్త వ్యాఖ్యలు, కొత్త భాష్యాలు, కొత్త అంతరార్థాలు ఆ ప్రవచనాలలో దర్శన మిచ్చాయి.

ఉదాహరణకు, 'నవ్వుతూ బ్రతకడం నేర్చుకుందాం' అనే కృష్ణాష్టమి ప్రవచనం అవతారమూర్తుల జీవితాలను ఎలా దర్శించాలో, నిత్యజీవితంలో ఎలా సమన్వయించుకోవాలో మార్గదర్శనం చేసే ఒక అపురూప వ్యాఖ్యానం. అలాగే – 'బైబిలు భగవద్గీతకు భాష్యం' అనే క్రిస్మస్ ప్రవచనము సర్వమత సమన్వయానికి కావలసిన విశాల దృష్టి నిండిన ఒక విలక్షణ భాష్యం.

ఈ ప్రవచనాలలో ప్రబోధంతోపాటు అద్భుతమైన సమన్వయం ఉన్నది. పాండిత్యంతోపాటు ఆయా ఆధ్యాత్మిక సత్యాలను, అనుభూతితో రంగరించి అందించే ఒడుపు ఉన్నది. పురాణ ఇతిహాసాలలోని నిత్య సత్యాలను ఈనాటి సామాజిక స్థితిగతులకు అన్వయించి చూపే నైపుణి ఉన్నది. అత్యంత గహనమైన వేదవేదాంత సూత్రాలను సామాన్యులకు అర్థమయ్యే రీతిలో సరళంగా, ఆసక్తి జనకంగా, ఆకర్షకంగా వర్ణించడంలో అనన్యమైన ప్రజ్ఞ ఉన్నది. ఆయా ప్రవచనాల ద్వారా ఆయన సందేశం ఆయన హృదయం నుండి శ్రోత హృదయాన్ని సూటిగా వచ్చి తాకుతుంది. స్పందింపజేస్తుంది. పరవశింపజేస్తుంది. ద్రవింపజేస్తుంది.

ప్రసన్న కథాకవితార్థ యుక్తి అంటారే-కథ చెప్పడంలోని కళ-అది ఈ ప్రవచనాలలో విశ్వరూపం ధరించింది. ఆర్ష విజ్ఞానాన్ని, వేదఋషుల అనుభవ సారాన్ని యువతరానికి, వారికి నచ్చే సరళిలో, అందించాలనే తపన దాగి ఉన్నది ఈ ప్రవచనలలో. అలా అందించే సామర్థ్యమూ వీనిలో పుష్కలంగా కనిపిస్తున్నది.

ప్రవచనాలను కలిపి సమీక్షించుకున్నపుడు అనిపించింది - ఈ రూపంలో సనాతన ధర్మ దివ్యహర్మ్యానికి సింహద్వారం తెరువబడింది అని.

కాగా-ఆ ప్రవచనాలను క్లుప్తీకరించి ఆంధ్రప్రభకు పంపిన వ్యక్తిగా పాఠకులకు ఒక మాట చెప్పవలసి ఉన్నది. ఇవి సారాంశాలు మాత్రమే. ఆయా ప్రవచనాలు వింటున్నప్పుడు కలిగే స్పందన, ప్రత్యక్ష అనుభూతి ఈ సారాంశాలవల్ల పూర్తిగా కలగవని నిశ్చయంగా చెప్పవచ్చు. అయినా, ఆ ప్రవచనాలను వినని వారికి వానిలోని ముఖ్యాంశాలను ప్రవచనకర్త మాటలలోనే అందించే ప్రయత్నం జరిగింది ఈ క్లుప్తీకరణలో. దిన పత్రిక పాఠకులను, దినపత్రిక ఉండే స్థల పరిమితులను దృష్టిలో ఉంచుకుని, అరగంట-గంటసేపు ఇచ్చిన ప్రవచనాన్ని ఐదు నిమిషాలలో చదివేందుకు వీలుగా కుదించి ఇవ్వవలసి వచ్చింది. ఈ పరిమితులను గమనించ వలసిందిగా పాఠకులకు మనవి.

దినపత్రికలో పడిన సారాంశాలను పదిలపరచుకోవడం కష్టం. విషయం శాశ్వత ప్రాధాన్యం కలిగినది కనుక వాటిని పుస్తక రూపంలో అందించాలనే ఆలోచన వచ్చింది. ఈ విధంగా పాఠకులకు వాటిని అన్నింటినీ కలిపి చదువుకునే సౌలభ్యం కలిగినందుకు ఆనందిస్తూ.

కందర్ప రామచంద్రరావు

24-5-89
విజయవాడ

# దైవయోగం అంటే ఇదేనేమో!

అది 1987 బహుశా ఏప్రియల్ నెల కావచ్చు. "విశాఖపట్టణ సోదర బృందం హోమియో శిక్షణ తరగతులు నిర్వహించమని అడుగుతున్నారు. ఒక డేట్ ఫిక్స్ చేయండి" అని పూర్ణచంద్రరావు మాస్టరు గారికి చెప్పాను. ఆయన కొంత సేపయిన తరువాత నవంబరు 1వ తేదీ బాగుంది మాస్టరుగారూ అని చెప్పారు. అలాగే నన్నాను. ఆ తర్వాత మే లో విశాఖలో గురుపూజలు. తరగతులకు నవంబరు దాకా ఆగడం కష్టం అన్నారు విశాఖ సోదరులు. జూన్ జూలైలలోనే కావాలి అన్నారు. సరేఅలాగే కానియ్యండి. అని వారికి చెప్పి, మాస్టరుగారూ అయితే మీరు పెట్టిన ముహూర్తం విజయవాడకు ఖాయం చేయండి అన్నాను పూర్ణ చంద్రరావుగారితో, ఇద్దరం నవ్వుకున్నాం.

విశాఖ సోదరుల కోరిక ప్రకారం అక్కడ శిక్షణ తరగతులను పూర్తిచేసి ఇక విజయవాడ శిక్షణ తరగతులకై బయలు దేరి వచ్చాను. తరగతుల నిర్వహణ పూర్తి చేసి మళ్ళీ విశాఖ వెళ్ళిపోవాలని ఉద్దేశం. కాని కథ ఇక్కడే మలుపు తిరిగింది. నవంబరు 1న క్లాసులు ప్రారంభమై డిశంబరు 31 వరకు నిర్విఘ్నంగా సాగాయి. 1988 జనవరి 1వ తేదీన 12 గంటలవేళ విజయవాడ నుండి బందరువైపుకు స్కూటరు వెళుతుండగా వెనుక చక్రంలోని వాల్వ్‌నెక్ బరస్టయి ప్రమాదానికి గురయ్యాం. నడుపుతున్న యువకుడు రక్షింపబడ్డాడు. నాకు మటుకు ఎడమ చెయ్యి భుజపు ఎముక పూర్తిగా విరిగిపోయింది. అనుకోని ఈ సన్నివేశంతో చేతికి కట్టుతో నేను మంచాన్ని ఆశ్రయించ వలసి వచ్చింది. క్లాసులు పూర్తి చేసే భారం పూర్ణచంద్రరావు మాస్టరుగారి పైన పడింది. మేలుకున్నంత వరకు సోదరులు నాకు సిద్ధమైన కేసులు వినిపిస్తుండే వారు. నేను వాటిని విని మందులు చెబుతుండే వాడిని. ఈ విధంగా వైద్యాలయం కూడ నిర్విఘ్నంగా సాగింది. నాకు కాలమూ సద్వినియోగమైంది.

విజయవాడలోని ఆ తరగతుల ప్రారంభోత్సవానికి వక్తలుగా ఆహ్వానింపబడిన వారిలో శ్రీ కందర్ప రామచంద్రరావు గారు ఒకరు. వారిని గూర్చి నేనిదివరకు విన్నాను. కాని, చూడటం మాత్రం ఈ సభలోనే. మొదటి కలయికలోనే మేం దగ్గరయ్యాం. ఆ సందర్భంలోనే మేం దగ్గరయ్యాం. ఆ సందర్భంలోనే వారు భారతం ధర్మాద్వైతాన్ని చదవడం జరిగింది. ఆ గ్రంథం వారికి నచ్చింది. ఆంధ్రప్రభలో ఆ గ్రంథంపైన సమీక్ష వ్రాశారు. వారు. మానవ ధర్మ శిక్షణ సంస్థ ద్వారా వ్యక్తమవుతున్న ఉద్యమం, ఆ ఉద్యమం కొరకు జరుగుతున్న ప్రయత్నం జాతిహిత నిష్ఠలైన వారికి నచ్చాయి. ఆ పైన వైద్య నిమిత్తంగానో, మరో నిమిత్తంగానో వారు తరచు దగ్గర కావడం జరుగుతూ వచ్చింది. జరిగిన ప్రమాదం, దాని వలన నేను మంచాన్ని పట్టడం వారికెంతో ఆవేదనను కలుగ జేశాయి. మీరు తొందరగా కోలుకోవాలి. ఆంధ్రప్రభలో రమణగారని ఒకరున్నారు. ఆయనకు మీ గ్రంథాలన్నీ ఇచ్చాను. వాటిని చదివి చాల ఉత్తేజితులయ్యారాయన. మన ఉద్యమాన్ని గూర్చి మీతో ఒక ఇంటర్వ్యూ చేయాలన్న ఉద్దేశ్యంలో ఉన్నారిప్పుడు. ఇంతలో ఇలా జరిగింది మీరు కొంచెం కోలుకున్న తరువాత ఆయన అన్నది ఏర్పాటు చేద్దాము. అన్నారు రామచంద్రరావుగారు. అలాగే అన్నాను నేను.

ఖమ్మం నుండి కొందరు సోదరులు వచ్చారు, వసంత నవరాత్రుల సందర్భంలో రామాయణంపైన ప్రవచనాలను కోరారు. అప్పటికింకా కట్టు ఊడతీయలేదు సరికదా తీవ్రమయిన జ్వరంతో బాధపడుతున్నాను. అది ఎటువంటి స్థితిఅంటే ఆ జ్వరం నడుస్తుండగా ఒక రెండు, మూడు రోజులు ఈ శరీరం ఉంటుందా? లేదా? అన్న సందిగ్ధావస్థలో నడిచాయి. అయినా "రాముడి కథ చెప్పమంటున్నారు కదా అని అప్పటికి లేస్తాను లెండి వస్తాను" అన్నాను.

కట్టు ఊడదీసిన మరసటి రోజు ప్రయాణం. చెయ్యి కొత్తగా ఉంది. శరీరం తేలిపోతూ ఉంది ఓపిక లేదు. కాని వెళ్ళాలి అన్న పట్టుదల

"రాముని భజనకు రమ్మని పిలువ రాలేననకే ఓమనసా" అన్న గేయభాగం చెవుల వినబడుతోంది.

రామాయణ ప్రవచనాలు ప్రారంభమయ్యాయి. ఖమ్మం స్టేషన్‌లో నాకు బస. ప్రక్కనే రైళ్ళ కూతలు. మోతలు. ఊరికి దూరంగా ఏదైనా ప్రశాంతమైన బస ఏర్పాటు చేయమన్నాను. ఎందుకనో వారు చెయ్యలేక పోయారు వాళ్ళు. ఆ రైళ్ళ చప్పుళ్ళకు నా నరాలు అదిరిపడు తున్నాయి. నే నసలే శబ్దాలను అంతగా వినలేను. కాని చేయగలిగింది. ఏముంది. నాల్గవరోజు ఉదయమనుకుంటాను. లేచి ముఖం కడుక్కుంటున్న నాకు అర్థమయ్యింది. ముఖంలో ఎడమభాగానికి పక్షవాతం ప్రాప్తించిందని. శరీరంలో ఓపిక లేదు కదా! నరాలు అపరిమితమైన బలహీనస్థితిలో ఉన్నాయి. దానికి తోడు బస చేసిన వాతావరణం కూడ బాగా దోహదం చేసింది. పెదవులు దగ్గరకు రావడం లేదు కాఫీ త్రాగడానికి ప్రయత్నం చేస్తున్న నాకు ఎంతలో ఎంత మార్పు. వెంటనే మందు తెప్పించి వేసు కున్నాను. రామాయణ ప్రవచనం మాత్రం ఆగకూడదనుకున్నాను. ప్రవచనం ప్రారంభమయిన 15 నిమిషాలకు పెదవులు, దవడలు కొద్దిగా చెప్పిన మాట విన నారంభించాయి. అలాగే మిగిలిన నాలుగు రోజుల రామాయణాన్ని ఏ అడ్డంకు లేకుండా పూర్తిచేసి విజయవాడ చేరుకున్నాను. అనుకున్న ప్రకారం రామాయణం సాగింది అన్న తృప్తి మిగిలింది. కానీ శరీరం పరిస్థితిలో మాత్రం దారికి రావలిసింది. ఇంకా చాలా మిగిలి ఉంది.

ఖమ్మం నుండి వచ్చిన మర్నాడు ఆంధ్రప్రభ నుండి L. V. రమణగారు ఇంటర్వ్యూ చేద్దామని వచ్చారు. పరిస్థితి చూసి ఆశ్చర్యాన్ని, ఆవేదనను పొందారు. పోనీ మరోసారి కూర్చుందామా! అన్నారు. ఏం? ఇప్పుడేమయింది? అన్నాను. మీరిలా ఉండగా! అన్నారాయన. ఇలా ఉన్నప్పుడే మీలాంటివారు కావాలి. కాలాన్ని సద్వినియోగం చేయడానికి! అన్నాను నేను. నేనూ, రమణగారూ, రామచంద్రరావుగారు, పూర్ణచంద్ర

రావుగారు కూర్చున్నాము రమణగారు ఏవేవో, ఎన్నెన్నో, అడిగారు. నేను అప్పటికి నాకు తట్టిన జవాబులు చెప్పాను. మీ ఫోటో కావాలి. మా ఫోటో గ్రాఫర్ ఉన్నాడు అన్నారు. ఇప్పుడిలా తీస్తారా? అన్నాను నేను నవ్వుతూ. ఆయనా నవ్వేరు. బాధగా. పాత ఫోటోలలో నుండి కొన్ని ఫోటోలు సెలెక్ట్ చేసుకున్నారు. మళ్ళీ కలుస్తామన్నారు. ఆ మరునాడే ఆయన మద్రాసు వెళ్ళినట్లు తెలిసింది.

1988 మే 4వ తేదీ ననుకుంటాను. C. V. V. E. K. M K. అన్న శీర్షికతో E. K. మాస్టరుగారూ, నేనూ ఉన్న ఫోటోతో ఆంధ్రప్రభ నందనం ప్రత్యేక సంచికలో రమణగారు వ్రాసిన పెద్ద వ్యాసం ప్రచురింప బడింది. ఆ వ్యాసంలో ఆయన మానవధర్మ శిక్షణ సంస్థద్వారా వ్యక్తమవు తున్న ఉద్యమానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ మాస్టరు E. K. కు వారసులు మాస్టరు M. K. అని వివరించారు. చిత్రం. నన్ను ఇంటర్వ్యూ చేసి నప్పుడు అసలీ వారసత్వ ప్రస్తావనే రాలేదు. శీర్షికకు కూడ పేరు ఆలా పెడతారని నేననుకోలేదు. ఏ జాతి పునర్నిర్మాణమనో పెడతారని అనుకున్నాను. ఏ చిత్రాలు ఎందుకు జరుగుతాయో, కాలానికే తెలియాలి.

1988 మే గురుపూజలు దగ్గరకు వస్తున్నాయి. ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్నాయి. ఒకటి రెండు రోజులలో గురుపూజ లనగా "ఆరోగ్యంలో చాలా తేడా చేసింది. ఇంకా మరికొన్ని రోజు లుందామనుకొని కూడా ఉండలేని స్థితిలో వచ్చేశాను. తగిన మందివ్వండి" అన్నారు రామచంద్రరావుగారు ఆందోళనగా. మందిచ్చి దానిదేముందిలెండి తగ్గిపోతుంది. మీరింతకూ ఎందుకు వచ్చారో తెలుసునా? గురుపూజల కోసం అన్నాను నేను. ఆయన నవ్వారు. ఆందోళన స్థానంలో ఆనందం వ్యక్తం కాసాగింది.

గురుపూజలలో దీక్షగా పాల్గొన్నారు రామచంద్రరావుగారు. ఆ మూడు రోజులూ వెలువడిన ప్రవచనాలు వారికెంతో నచ్చాయి. ప్రజ లందరిలోకి వెళ్ళవలసిన ప్రవచనాలివి. అన్ని ఆయన అనుకుంటూ

ఉండగా ఇంతలో సంతానం గోపాలాచార్యుల వారి ప్రవచనాలు శివరామ కృష్ణ క్షేత్రంలో ప్రారంభమయ్యాయి. ఆంధ్రప్రభ వారు ఆ ప్రవచనాల సారాంశాలను ప్రచురణకు అందివ్వ వలసినదిగా రామచంద్రరావుగారిని కోరారు. ప్రజలు ఆ సారాంశాలకు స్వాగతాలు పలికారు. ఆపైన గురు పూజల ప్రవచన సారాంశాలను ప్రభ వారికి అందించారు రామచంద్రరావు గారు. అలా ప్రారంభమైన ఈ ప్రవచనాల సారాంశాల ప్రచురణ, ప్రజలు వాటి ఎడల చూపిన ఆదరాభిమానాల వలన ,ఇక ఆగకుండా సాగింది. దాదాపుగా ఆపైన నానుండి వెలువడిన ప్రవచనాల సారాంశాలన్నీ ఆంధ్రప్రభ ద్వారా ప్రజలందరికీ అందాయనే చెప్పవచ్చు. ఈ సారాంశా లను విజయవాడ ఎడిషన్‌తోపాటుగా విజయనగరం ఎడిషన్ వారు గూడా ఏక కాలంలో ప్రచురించడం జరిగింది. దానితో విశాఖపట్టణ ప్రాంతం వారికి కూడా ఈ ప్రవచనాలు ఎప్పటికప్పుడు అందుతూ వచ్చాయి. అదొక తృప్తి. ఎందువల్లనంటే శారీరకమైన స్థితి గతుల వలన కదలలేని స్థితిలో, కదల కూడని స్థితిలో పెట్టబడ్డాను నేను. శరీరం శ్రమకు గురి కాకూడదు. ప్రయాణాలు మొదలైనవి చేయలేని స్థితి. ఒకవేళ బలవంతంగా చేస్తే మరింతగా అస్వస్థతకు లోనయ్యే పరిస్థితి. కాని మనసులో విశాఖపట్టణం వెళ్ళలేకపోయాననే అన్న బెంగ విజయనగరం ఆంధ్రప్రభ వారు ఆ బెంగను చాలా వరకు తీర్చివేశారు. ఈ ప్రవచనాల ప్రచురణ ద్వారా.

దైవయోగం అంటే ఇదేనేమో! "మానవ ధర్మ శిక్షణ సంస్థ" నెలకొల్పబడి ఇంకా ఎంతో కాలం కాలేదు. ఈ సంస్థ ద్వారా వ్యక్తం కాదలచిన ఉద్యమానికి పునాదులు వేయబడుతున్న వేళ ఇది. ఆ ఉద్యమ నికి కావలసిన అన్ని విధాల బలాలు, బలగాలు సమకూర్చబడవలసిన వేళ ఇది. అలాంటి ఈ సమయంలో నేను వరసగా అనారోగ్యాలకు గు కావడం నెలల తరబడి మంచంపైనే ఉండవలసి రావడం... నిజం? దారుణమైన ఆ ... ఉద్యమానికి విఘాతం వచ్చేటంత పరిణామమే! ...

అలా జరగలేదు సరిగదా! ఉద్యమం మరింత విజృంభించింది. దశదిశలా వ్యాపించింది. కందర్పగారి కలాన్ని అది స్వీకరించింది ఆంధ్రప్రభ ద్వారా అది ఎందరినో చేరువ అయ్యింది. ఎందరి హృదయాలనో దోచుకున్నది. ఒక నూతన, సనాతన చైతన్యం అంతటా వెల్లివిరిసింది.

ఇది నిజంగా ఆనందకరమైన అంశం. "మంచి పనిని నీవు మొదలుపెట్టు. ఇక ఆ పనికి కావలసిన దోహదాలన్నీ వాటికవిగా నడచి వస్తాయి" అన్న E. K. మాస్టరుగారి ఉపదేశం మరోసారి నిజమయింది. మరోసారి ఋజువయింది. అలాంటి దోహదాలలో ప్రధానమైన దోహదంగా రూపు ధరించి జాతి శ్రేయస్సుకై నడుస్తున్న ఈ ఉద్యమ నిర్వహణలో తమ స్నేహ హస్తాలను అందించిన ఆంధ్రప్రభ దినపత్రిక సంపాదకులకు నా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. ఇప్పుడీ ప్రవచన సారాంశాలు గ్రంధరూపాన్ని ధరిస్తున్నాయి. ఈ గ్రంథం శాశ్వతంగా నిలిచిపోతుంది. ఎందువల్లనంటే ఈ గ్రంథంలో వివరించబడ్డ అంశాలకున్న శక్తి అంతటిది. లోకానికి వాటి ఆవశ్యకత అంతటిది. ఇలా గ్రంథరూపాన్ని ధరింపచేసేటందుకు కూడా ఆనందంగా అనుమతించారు ఆంధ్రప్రభ వారు. అంతే కాదు. ముందుమాట పలుకుతూ ఈ గ్రంథాన్ని మీకు పరిచయం చేస్తున్నది కూడా వారే. అందుకు చాల సంతోషంగా ఉంది.

ఎందుకింత కథ చెప్పానో మీరిప్పటికి గ్రహించే ఉంటారు. గ్రంథాన్ని గ్రహించడంతో పాటుగా ఆ గ్రంథం వెనుక ఉన్న కథలోని మలుపులను కూడా మీరు గ్రహిస్తారనీ, మీరు గ్రహించాలనీ ఈ మాత్రం వ్రాశాను. ఇక గ్రంథంలోనికి ప్రవేశించండి. అనుభవించవలసిన స్థితిని అందించడానికి అది సిద్ధంగా ఉంది.

విజయవాడ,
24-5-89

మోపిదేవి కృష్ణస్వామి

# అది అనుభవించవలసిన స్థితి

మనిషి ఆశ్రమ ధర్మాలు నాలిగింటినీ ఎందుకు పాటించాలి?

శాశ్వత బ్రహ్మచారి అయిన శుక యోగీంద్రుడు ఆదర్శగృహస్థు, రాజర్షి అయిన జనకుడిని అడిగాడు ఈ ప్రశ్న.

జనకుడు సమాధానం చెప్పాడు. రజోగుణం నుంచీ, తమోగుణం నుంచీ మనిషిని విముక్తి చేయడానికి ఒకే ఒక మార్గం నాలుగు ఆశ్రమముల వ్యవస్థ. మూడు గుణములకూ అతీతమైన స్థితిని చేరడానికి సాధన ఈ నాలుగు ఆశ్రమాలూ.

జీవితమూ, సాధనా వేరుకావు. జీవితంలోని అనుభూతియే సాధన. ప్రవర్తనయే సాధన. సంసారం ఒక జంజాటం, ఒక లంపటం అనుకోవటం పొరపాటు. మెలకువతో నిర్వహిస్తే కుటుంబమే ఒక సాధన. ఆ మెలకువ లేకుంటే జీవితం యాంత్రికంగా మారుతుంది. గానుగెద్దు జీవితం అయిపోతుంది. మేలుకుని ఉంటే జీవితం నిత్యనూతనం. లేకపోతే రొటీన్. అనుభూతులను రుచి చూస్తూ బ్రతకడం సాధన. ఆ ఒడుపు తెలియక పోతే జీవితం ఒక వేదన. మనిషి శ్లేష్మంలో పడ్డ ఈగ.

అలా జాగరూకతతో బ్రతకడానికి తగిన శిక్షణ మనిషికి నాలుగు ఆశ్రమాలలో లభిస్తుంది.

మరి మూడు గుణాలకూ అతీతమైన స్థితిలో ఉన్నపుడు కూడా ఆశ్రమ ధర్మాలను పాటించాలా? శుకుని ప్రశ్న. లోకకల్యాణం కోసం పాటించడమే మంచిది జనకుని జవాబు.

జ్ఞానం కలగడానికి కర్మ చేయాలి. అజ్ఞానం నిలబడాలన్నా కర్మ చేయాలి. కర్మ జ్ఞానములను విడదీయకూడదు. కర్మల పట్ల విముఖత యోగం కాదు, రోగం. సంసారం. కుటుంబం కాళ్ళకు బంధాలు అని కోపటం అదలేక మద్దెల ఓడు అనడం. అయితే మీలాంటి కొద్దిమందికి ఈ ఆశ్రమ ధర్మాల నుండి మినహాయింపు ఉన్నది. అని వివరించాడు జనక మహారాజు

నిజమే అన్నాడు శుక మహర్షి.

భారతంలోని సంవాదం ఇది. జ్ఞాన మార్గం ఇది.

భాగవతం అనుభూతి మార్గాన్ని చూపుతుంది.

భాగవత ప్రారంభంలో నారద మహర్షి వ్యాసునకు తన పూర్వజన్మ కథ చెపుతాడు. నారదుని తల్లి వేదవిదుల ఇంటిలో దాసిగా పనిచేస్తు ఉంటుంది. ఒకసారి చాతుర్మాస్య దీక్ష కోసం చాలామంది సన్యాసులు ఆ ఇంటిలో బస చేశారు. ఆ పెద్దలకు సపర్య చేయడానికి తల్లి నారదుడిని నియమించింది ఆ పిల్లవాడు ఎంతో భక్తి శ్రద్ధలతో పెద్దలకు సేవ చేస్తున్నాడు. చేస్తూనే వారు చెప్పుకునే భాగవత కథలు వింటున్నాడు. అతనికి ఉల్లాసం కలుగుతోంది. ఆనందం కలుగుతోంది. ఏదో దివ్యమైన అనుభూతి కలుగుతోంది. అతని ఎద పులకించిపోతోంది.

చాతుర్మాస్యం నాలుగు నెలలూ ఇట్టే గడిచిపోయాయి. ఆ ఋషులు ఈ క్షుద్రవాడిని గమనించారు. అతనిలోని సాధనను గమనించారు. ఆర్తిని గమనించారు. ఆర్తి కలిగినవాడు ఎవడైనా మంత్రం పొందడానికి అర్హుడే కనుక వారా పిల్లవాడికి విష్ణు ఉపాసనా మంత్రం ఉపదేశించారు. విష్ణువే విశ్వము, విశ్వమే విష్ణువు అనే అనుభూతి కలిగించే మంత్రమది.

అందువల్ల "మా అమ్మలో విష్ణువును చూడాలి" అనుకున్నాడు పిల్లవాడు. సాధన జరుగుతోంది. తల్లికి ఆ పిల్లవాని మీద వల్లమాలిన ప్రేమ.

...ణం అతడిని విడిచి ఉండేదికాదు. ఎంతో గారాము చేసేది. ఆ పిల్లవాడికి మా|తం ఆమెలో కాస్సేపు తల్లి. కాస్సేపు విష్ణువు కనబడుతున్నాడు. సాధన సాగిన కొలదీ ఆమెలో తల్లిపాలు తగ్గి విష్ణువు పాలు పెరుగుతూ వచ్చింది. అతని దృష్టిలో. ఆమె తనను కేవలం పిల్లవాడుగా చూచినా, తనలో విష్ణువును చూడలేకపోయినా అతడు బాధ పడలేదు. ఆమె సాధన ఆమెది.

ఇలా సాధన మెట్లు మెట్లుగా ముందుకు సాగుతూ వచ్చింది. తల్లిలో విష్ణువు పాలు మూడు వంతులు అయింది. ఇంకా పెరిగింది. పెరిగి పెరిగి తల్లి విష్ణువుగా భాసించింది.

రా|త్రి చీకటిలో పాలు పితుకుతూ ఉండగా తల్లికి పాము కరచింది. ఆమె చనిపోయింది.

ఈ సంఘటనలు రెండు వెంట వెంటనే జరిగాయి. ఆవిడ పాత్ర అయిపోయింది. కాలసర్పం ఆమెను కాటువేసింది అనుకున్నాడు నారదుడు. జీవిత మంతా సాధనేకదా! రజస్సునూ, తమస్సునూ జయించడానికి శిక్ష కదా. ఇదంతా సాధనలో భాగమే అనుకున్నాడు నారదుడు. ఇక లోకమంత టినీ సేవించవచ్చు అనుకున్నాడు. అందరిలోనూ ఆ విష్ణువునే సేవించవచ్చు అనుకున్నాడు సంచారం |పారంభించాడు. జీవరాసుల |ప్రవర్తనలో దైవాన్ని చూడటం మొదలు పెట్టాడు. |ప్రవర్తనా స్వరూపమైన వాసుదేవుడిని ఉపాసించాడు. అలా ఉపాసించగా ఉపాసించగా అతనికి |ప్రవర్తనల వెనుక ఉన్న |ప్రవర్తనలకు అతీతమైన రూపములకు |ప్రవర్తనలకు మూలమైన బిందు|ప్రాయమైన, |ప్రజ్ఞామయమైన, నారాయణ స్వరూపం కనిపించింది.

దివ్యమైన ఆ అనుభూతిలో అతడు మునిగిపోతున్నాడు. తన్మయం చెందుతున్నాడు. లీనమై పోతున్నాడు.

ఆ క్షణంలో అతనికి ఒక చిలిపి ఆలోచన వచ్చింది. ఆ అను ఇలా శాశ్వతంగా ఉండిపోతే బాగుండునని. అంతే. తక్కున ఆ అను ఎగిరిపోయింది. ఇతడు మిగిలిపోయాడు.

నారదుడు ఏడుస్తున్నాడు. నెత్తీ నోరూ కొట్టుకుంటున్నా ఆ అనుభూతిని రుచి చూచాడు కనుక అది జారిపోయినందుకు బాధప తున్నాడు. ప్రయోజనం లేకిపోయింది.

ఎందువల్ల?

హృదయమనే సింహాసనం మీద చోటు ఒక్కడికే ఉంటుంది. నీ ఉంటే దైవం ఉండదు. దైవం ఉంటే నీవు ఉండవు. ఇక్కడ-ఎప్పు నారదుడు. నేను నా అనుభూతి అనుకున్నాడో ఎప్పుడైతే నే ప్రవేశించిందో దైవం అదృశ్యం అయినాడు. ఆ జన్మకు మరి కనపడలేదు

శోకిస్తున్న నారదునికి ఆకాశవాణి వినిపించింది. వచ్చే జన్మలో నీకు సిద్ధి. అప్పుడు బ్రహ్మ మానస పుత్రుడుగా పుట్టి దేవర్షిగా త్రిలో సంచారం చేస్తూ నారాయణ సంకీర్తనం చేస్తూ భక్తిరసాన్ని పం పెడతావు అని.

ఇలా తాను పతనం చెందిన కథను భాగవతంలో మొదట మని అడుగుతాడు నారదుడు వ్యాసుడిని. ఎందుకని? సాధకుడు అలా పోకూడదని. అన్నింటినీ దైవదత్తములుగా అనుభవించాలి కాని ప్రశ్నిం కూడదనే పాఠాన్ని గ్రహించాలని.

[29-5-88 సాయంత్రం గురుపూజా వేదికపై చేసిన ప్రవచ సారాంశం]

# ఎదిగిన మనిషి ఎలా ఉంటాడు?

నారదుడు దాసీ పుత్రుడు. మామూలు మనిషి. అయినా, సజ్జన సాంగత్యం వల్ల, భాగవతుల సంసర్గం వల్ల, మహనీయుల సాన్నిధ్యం వల్ల, సద్‌గోష్టివల్ల అతనికి మంత్రసిద్ధి లభించింది. "గురు శుశ్రూష యా విద్య." గురువుల సేవ మనిషి జీవితాన్ని వెలిగిస్తుంది.

అశ్వత్థామ ఘట్టంలో ద్రౌపది ప్రవర్తించిన తీరు మరో భాగవత సూత్రాన్ని వెలికి తెస్తుంది.

అశ్వత్థామ ఉక్రోషంతో ఉప పాండవులందరినీ ఊచకోత కోస్తాడు. అయినా కసి తీరలేదు. పాండవ కుటుంబాలలో ఎవరైనా గర్భవతులుగా ఉన్నారేమోనని విచారిస్తాడు. ఉత్తర గర్భవతి అని తెలుసుకుని ఆ గర్భస్థ శిశువు మీద బ్రహ్మాస్త్రం ప్రయోగిస్తాడు దుష్టబుద్ధితో.

ఇక్కడ ఉప పాండవుల వధవార్త విన్న ద్రౌపది మొదలు నరికిన అరటి చెట్టులా కూలిపోయింది. దుఃఖంతో పాటు రోషమూ కలిగింది. ఆమెకు. 'నా తనయులను చంపిన అశ్వత్థామను పట్టి తీసుకురండి'— అన్నది, భీమార్జునులతో. అశ్వత్థామను ఏమి చేసినా పాపం లేదు అనుకున్నది ఆ దుఃఖావేశంలో. సరే, వారు వెదకి అశ్వత్థామను బంధించి తెచ్చారు. వీడిని ఏమి చేయమంటే అది చేస్తాం అన్నారు.

అప్పటికి ద్రౌపది తన ఆవేశాన్ని తమాయించుకుంది. తనను తాను కూడదీసుకుని ఒక్కమాట అన్నది. అక్కడ ద్రోణుని భార్య భర్త మరణించినా తన కుమారుడి కోసం బ్రతికి ఉన్నది. గర్భశోకం ఎలాంటిదో నాకు అనుభవం అయింది. ఇపుడు అశ్వత్థామను చంపించి ఆమెకు ఆ గర్భశోకం ఎందుకు కలిగించాలి? ఆ బాధ ఏమిటో నాకు

తెలిసింది. ఆ బాధ మరెవరికీ కలుగకూడదు. శిరస్సు మీద ఉన్న మణిని తీసుకుని వీడిని వదిలెయ్యండి.

తనకు ఎలాంటి బాధ కలిగిందో అలాంటి బాధ శత్రువుకు కలగాలని అనుకోవడం మామూలు స్థితి. మరో మెట్టు ఎదిగి ఆ బాధ పగవాడికి కూడా వద్దు అనుకోవడం భాగవత ధర్మం. క్షమాగుణం భాగవత ధర్మం లోని మొదటి సూత్రం.

ఈలోగా ఉత్తర ఏడుస్తూ వస్తోంది నాగర్భంలో ఉన్న శిశువును బ్రహ్మాస్త్రం దహించి వేస్తోంది ప్రభూ! అతడిని రక్షించు భువన భాండములు అన్నిటినీ నీకుక్షిలో ఉంచి రక్షించే నీవు నా కడుపులో ఉన్న పాపను రక్షించలేవా! అని కృష్ణుడిని వేడుకొంటోంది. నాకడుపు మండు తోంది. నన్ను రక్షించు, అని కోరలేదు ఆమె. లోపల ఉన్న బిడ్డ కుమిలి పోతున్నాడు, వేగిపోతున్నాడు అంటోంది.

ఇది భాగవత ధర్మంలోని రెండవ సూత్రం 'తాను' అన్నది కరిగిపోవాలి. నాకోసం కాక నా వాళ్ళకోసం నన్ను నమ్ముకున్న వాళ్ళ కోసం వారి కష్ట సుఖాలు చూడటం కోసం నేనున్నాను–అని భావించే స్థితి ఉత్తమస్థితి. తనను తాను మరచిన ఆ స్థితి రావాలి. అలాకాక ఎవరికి వారు గుర్తుంటే మిగిలేవి సమాన హక్కుల కోసం పోరాటాలే.

ఆ తర్వాత యుద్ధం ముగిసింది కనుక యాదవులంతా ద్వారకకు ప్రయాణమైనారు. కుంతి కృష్ణునితో ఆగు స్వామీ అన్నది. చిన్న పని చేసి పెట్టమన్నది. జీవితంలో ఎలాంటి సన్నివేశం ఎదురైనా నా మనస్సు నీ మీదనే లగ్నమయ్యేట్లు చేయి. ఇంతకాలం కష్టాలలో గడిపాము. అపుడు దైవస్మరణ కలగడం సహజమే. ఇపుడిక భోగభాగ్యాలు. నాకు రాజమాత హోదా. అసలు కష్టం ఇపుడే మొదలైంది. ఎందుకంటే నిన్ను మరచి పోయేందుకు పూర్తి అవకాశం ఉంది -ఈ రాజ వైభవాల మధ్య.

అంతఃపుర పరిచారికల సందడుల మధ్య, ఉత్సవాల కోలాహలాల మధ్య, రెండో కోరిక త్రుంపవే భవలతల్. ఈ భవబంధాల నుంచి నాకు ముక్తి కలిగించు. నా తదుపరి కర్తవ్యం ఏమిటో నాకు బోధించు.

శ్రీకృష్ణుడు సరే అంటాడు. ఆమెకు కర్తవ్య బోధ కలుగుతుంది. ఇక ఈ ఘట్టాన్ని భారతంలో వర్ణించాడు వ్యాస మహర్షి.

ధృతరాష్ట్రుడు గాంధారితో పాటు అడవులకు బయలుదేరాడు. ధర్మరాజు కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు. వారిని ఉండమంటున్నాడు. వ్యాసుడు వాళ్ళను పోనివ్వు! అని ధర్మరాజుకు సైగ చేశాడు. ధర్మరాజు చూస్తూ ఉండగా ఆ పోయే ఇద్దరూ ముగ్గురైనట్లు కనిపించింది. అమ్మా— అన్నాడు ధర్మరాజు. ఇది ఇంతే అన్నది కుంతి—మీపట్ల నేను నిర్వహించ వలసిన బాధ్యత పూర్తయింది. మీరు గెలిచారు. రాజ్యం సంపాదించు కున్నారు. ఇక మీదట మీకు నా సేవ అవసరం లేదు. ఈ వృద్ధులు ఇద్దరికీ ఆ అవసరం ఉన్నది. ధృతరాష్ట్రునికి ఎవరూ లేరు. ఇతడు గ్రుడ్డివాడు. గాంధారి కళ్ళకు గంతలు కట్టుకున్న వ్యక్తి. గ్రుడ్డిదాని వంటిదే. అక్కకు, బావకు సేవ చేయడం నా ధర్మం. వారు నాకు తల్లి దండ్రుల వంటివారు. వారి సేవకే ఈ జీవితాన్ని అంకితం చేస్తున్నాను.

కుంతి తీసుకున్న ఈ నిర్ణయం భాగవత ధర్మానికి తుదిమెట్టు. ధృతరాష్ట్రుడు పాండవులను రాచి రంపాన పెట్టినవాడు, దారుణ దృశ్యాలను సృష్టించినవాడు, నిన్న మొన్నటి వరకు బద్ధ శత్రువు. ఆ కష్టాలన్నీ మరిచి, ఆ అవమానాలన్నీ మరచి, ఆ మాయోపాయాలన్నీ మరచి – ఆ ధృతరాష్ట్రుని సేవకు తనను తాను అర్పించుకోవడం క్షమకూ, ఔదార్యానికి మానవత్వానికి కర్తవ్య పరాయణత్వానికీ శిఖరాగ్రం. ఎదిగిన మనిషి ఎలా నడుచుకోవాలో తెలుస్తుంది. కుంతి తీసు కున్న ఈ నిర్ణయం ద్వారా.

* * * * * *

[30–5–88న విజయవాడలో గురుపూజావేదికపై సాయంత్రం చేసిన ప్రవచన సారాంశం]

# కష్టాలు కావవి-సాధనలో సోపానాలు

ధర్మరాజు విషాద యోగంలో పడ్డాడు. యుద్ధంలో బంధువులంతా చనిపోయిన తర్వాత పరిపాలన చేయబుద్ధి కావడం లేదు. నేను అడవికి పోతాను అంటాడు మేమూ వెంట వస్తాం అంటారు తమ్ములు. నలుగురూ ఆ అయిదుగురినీ భీష్ముడి దగ్గరకు తీసుకు వెళ్ళాలని వ్యాసుడు సూచిస్తాడు. ముందు పట్టాభిషేకం చేయండి ఆ తర్వాత భీష్ముడి ఉపదేశం వినిపించండి అంటాడు కృష్ణుడు. ముందు బాధ్యత స్వీకరించాలి ఆ తర్వాత ఆ బాధ్యతా నిర్వహణ ఎలాగో బోధ పొందాలి. భూమిమీద జ్ఞానమయ దేహంతో మిలిగిన మహాను భావుడు ఉత్తరాయణం కోసం ఎదురుచూస్తున్నాడు. ఆయనను పలకరించి, ఆశ్వాసించి ఆయన నుండి ఆశీస్సులు బోధలు పొందాలి అంటాడు భీష్మ యుధిష్టిర సంవాద ఘట్టాన్ని వ్యాసుడు భారతంలో జ్ఞానపరంగా వర్ణించాడు.

నీవు ఉండగా నేను చెప్పడం ఏమిటి? అంటాడు భీష్ముడు కృష్ణునితో. కాదు నీవే చెప్పాలి అంటాడు కృష్ణుడు. భక్తుని నోట వింటేనే భగవానునికి తృప్తి. కాయమంత గాయమయ్యె అంపశయ్య ముళ్ళపాన్పులా ఉంది. శరీరం నుంచి రక్తం ఓడుతోంది. మనస్సు వివశం అయింది. అయినా ఈ ధర్మ మూర్తికి బోధించవలసింది ఏముంది? అని తప్పుకో వాలని చూస్తాడు భీష్ముడు. నీ బాధలన్నీ పోతాయి. జ్ఞాన విజ్ఞానాలన్నీ నీకు అందుబాటులో ఉంటాయి. అన్నాడు కృష్ణుడు ఇక తప్పదని. అను కున్నాడు భీష్ముడ . రంగంలోకి దిగిన తర్వాత ఆయన ఉద్దండుడే ఆయన చేసిన ఉపదేశం భారతంలో ఉంది. భాగవతంలో ఆయన ఒకే ఒక ప్రశ్న అడుగుతాడు.

వ్యాసుడు గొప్ప ఎడిటర్. ఎక్కడ ఏది చెప్పాలో అక్కడ అది చెపుతాడు. అదే సన్నివేశం ఇక్కడ భాగవతంలో దానిని భక్తిమార్గపరంగా శరణాగతి మార్గపరంగా చెపుతున్నాడు.

భీష్ముడు అడుగుతున్నాడు.

ఇదంతా చిత్రంగా ఉంది నాకు. ధర్మం ప్రకారం బ్రతుకుదాం అనుకున్నారు మీరు. దైవాన్ని నమ్మి బ్రతికారు. పెద్దల మాట ప్రకారం బ్రతికారు. ఋషుల వాక్యాలను అనుసరించి బ్రతికారు. ధర్మమో ధర్మమో అంటూ బ్రతికినా మీకు కష్టాల మీద కష్టాలు వచ్చిపడడం చిత్రంగా ఉంది. ఆ కష్టాలలోనే నీకు ముసలితనం వచ్చేసింది. ఆ కుంతిని చూడు, అన్నీ దుఃఖాలే ఆమెకు. వేటకు వెళ్ళి గుడారాలు వేసుకుని అక్కడే కథలు నడిపి శాపం పొంది మరణించాడు ఆమె భర్త. కానలకు భర్తను అప్పగించి కూనలను తెచ్చింది. మిమ్మల్ని ఇంత వాళ్ళను చేయడానికి ఎన్ని తిప్పలు పడ్డది! పరాయిపంచన వంచకుల పంచన ఎన్ని బాధలు పడ్డది! ఆమె సుఖపడిన క్షణం ఉన్నదా!

మీరు ధర్మ నిష్ఠులు కనుక మీకు పూర్వకర్మ బంధం లేదు. మీ సామర్థ్యం తక్కువది కాదు. దైవం మానవాకృతి ధరించి సారథిగా మీ రథం మీదనే కూర్చున్నాడు. ఏ లోటు ఉందని మీకీ ఆపదలు ముంచుకు వచ్చాయి?

మీరు అరణ్యవాసం చేశారు. అజ్ఞాత వాసం చేశారు. వేషాలు మార్చుకున్నారు. నీవు పాచికలు పట్టుకొని మరొకరి కొలువులో కాలక్షేపం చేశావు ఏమి? కొలసిరాక మీరు అలా బ్రతకవలసి వచ్చింది?

ఈ ప్రశ్న అడుగుతూ భీష్ముడు ధర్మరాజు ముఖం చూస్తున్నాడు. ఆ ముఖంలో పెదవి విరుపులేదు. చింతలేదు. ప్రశాంతంగా ఉంది ఆ ముఖం

ధర్మరాజు సమాధానం చెపుతున్నాడు. అవన్నీ కష్టాలనీ, ఆపదలనీ సమస్యలనీ ఎందుకనుకోవాలి? మన సాధనకు ఏది అవసరమో మన కర్తవ్య నిర్వహణకు ఏది అవసరమో ఆ సన్నివేశం మన జీవితంలోనికి నడచివస్తుంది. మన పాత్ర పోషణకు, లోక కళ్యాణానికి అవసరం కనుక ఆ సన్నివేశం వస్తున్నది. ఇతరులకు ఏది ఆపదో! ఏది కష్టమో! ఏది సమస్యో! భాగవతునికి అది ఒక కర్తవ్యనిష్ఠకు అవకాశం సాధనలో ఒక సోపానం.

పాచికలు ఇచ్చినా రాజ్యం ఇచ్చినా అంతా దైవం యొక్క అనుగ్రహం. ఆయన ఆజ్ఞ కనుక నిర్వహించాలి.

ధర్మరాజు ఇచ్చిన ఈ సమాధానంలో భాగవత ధర్మమంతా ఇమిడి ఉంది. ద్రౌపది అశ్వత్థామను క్షమించింది. ఉత్తర తనను గురించి కాక గర్భస్థ శిశువు గురించి ఆలోచించింది. కుంతి భోగభాగ్యాలు లభించిన తరుణంలో నాకు నీతో ఎడతెగని సంబంధం ఏర్పరచు అని వేడుకుంటుంది కృష్ణుడిని. ఇప్పుడు ధర్మరాజు జీవితంలో వచ్చే సన్నివేశాలు ఎంత బరువైనవి, అయినా, నా కర్తవ్య నిర్వహణకు అవసరం కనుక నా ప్రభువు వాటిని నావద్దకు నడిపించాడు అంటున్నాడు. ఇది భాగవత ధర్మంలోని మూల సూత్రం.

మనిషి జీవితంలో ఏ సన్నివేశం ఎందుకువస్తుందో ఆ ఈశ్వరునికి, ఆ విష్ణుమూర్తికే తెలుసు. అతడు తెలియనిస్తేనే నీకు తెలుస్తుంది. సన్నివేశాలను కల్పిస్తున్నది. అతడు గుర్తు చేస్తున్నది. అతడు మరపిస్తున్నది.

అతడు విశ్వరూపం చూపినవాడు. అర్జునునికి అభిమన్యుని మరణం చూపలేడా? అర్జునుడు భరించలేడు కనుక కృష్ణుడు ఆ సన్నివేశాన్ని చూపలేదు అది జరిగిన తర్వాత ఓదార్చాడు. భగవద్గీత అంతా విన్నవాడివి ఇప్పుడు.

ఏడుస్తున్నావా ? అని అడగలేదు. షోడశ మహారాజుల చరిత్ర చెప్పి ఆ రాజులే వెళ్ళిపోయారు. వెళ్ళక తప్పదు. ఏం చేద్దాం. ఇది సృష్టి ధర్మం. ఇది కాలధర్మం అన్నాడు. అసలు అభిమన్యుని మరణానికి కారకులు ఎవరు? అని ప్రక్కవారిని అడిగాడు. సైంధవుడు అడ్డ పడడం కారణమని సమాధానం వచ్చింది. సైంధవుడు అంతపని చేశాడా అన్నాడు అర్జునుడు. బావా రథం ఎక్కు వాడిసంగతి చూద్దాం అన్నాడు. ఆ విధంగా కృష్ణుడు అర్జునుడిని కర్తవ్యోన్ముఖుడిని చేశాడు.

దైవ తంత్రంబైన పనికి వగవం బనిలేదు. సన్నివేశాన్ని ఆ విధంగా చూడడం భాగవత మార్గంలో సాధన.

నారదుని పూర్వ జన్మకథ ద్రౌపది, ఉత్తర, కుంతి, ఆయా భాగవత లక్షణాలు కనబరచిన ఘట్టాలు. ఈ భీష్ముని ప్రశ్న ఘట్టం. ఇవన్నీ భాగవతం ప్రారంభంలో ఉన్నాయి. అంటే ఈ లక్షణాలు అలవరచు కుంటే భాగవతం చదవడానికి తగిన అర్హత లభిస్తుంది.

[31-5-88 న విజయవాడలో గురుపూజా వేదికపై సాయంత్రం చేసిన ప్రవచన సారాంశం]

# గృహం ఒక ఆలయం,
# గార్హస్థ్యం ఒక యజ్ఞం

ఈ శరీరం మనకు ఎందుకు ఇవ్వబడిందో అందుకోసం దీనిని వినియోగించాలి. శరీరం కోసం బ్రతక కూడదు. శరీరంతో బ్రతకాలి. శరీరాన్ని సద్వినియోగం చేయడానికి శిక్షణ అవసరం. శరీరం ఏమిటో, సృష్టి ఏమిటో తెలుసుకోవాలి అదే తత్త్వజ్ఞానం దైవకార్యానికి అనుగుణంగా అలా శరీరాన్ని తీర్చిదిద్దుకోవడమే యోగసాధన.

మనం తగు తయారీ లేకుండ తగు శిక్షణ లేకుండా బ్రతుకుతున్నాం. కనుకనే జీవితమంతా సమస్యలతో ఘర్షణలతో నిండి ఉంటున్నది. అందరూ బ్రతకడం చేతకాని వాళ్ళే. సైకిలు తొక్కడం చేతకాని వాళ్ళంతా రోడ్డున పడితే ఏమవుతుంది? శిక్షణలేనివాళ్ళు కలిసి ఉండాలంటే ఎంతకష్టం?

కాని మనిషి అలాంటి శిక్షణ పొందడానికి తనకు తీరిక లేదంటున్నాడు. నా తరపున నువు పూజ చేయి. ఆ ప్రసాదం పోస్టులో పంపించు. అందుకు డబ్బిస్తాను అంటున్నాడు. అలాంటి వాడికి ఎలా బ్రతకాలో ఎలా తెలుస్తుంది.

శరీరము, మనస్సు, బుద్ధి, ఇవన్నీ మన పరికరాలు, పనిముట్లు. వాటి తత్వం తెలియకపోతే. వాటిని ఎలా నడపాలో తెలియకపోతే సరిగా, బ్రతకడం ఎలా?

అద్వైత్వాన్ని ప్రతిపాదించిన ఆదిశంకరులు సైతం, సత్సంగత్వే నిస్సంగత్వం, అని ఇందుకు దారి చూపారు. జీవించడం చేతనైన వారివద్ద

దాన్ని నేర్చుకోవడమే ఆ దారి. వారి దీవెన పొందడమే ఆ దారి. అదే గురు శిష్య సంప్రదాయం. అలాంటి గురువు వద్ద శిక్షణ పొందే ప్రయత్నమే యోగ సాధన.

మాస్టర్ సి. వి. వి. యోగ సాధనకు కొన్ని నియమాలు చెప్పారు.

శరీరాన్ని పస్తు పడుకోబెట్టి ప్రార్థనకు కూర్చోవద్దు అనేది మొదటి నియమం. ప్రార్థనలో గురువు ఇచ్చే శక్తిని స్వీకరించడానికై శరీరానికి కొంత త్రాణ అవసరం. సాధన నీకా? నీ శరీరానికా? శరీరాన్ని మాడ బెడితే మోక్షం వస్తుందా? పవిత్రీకరణ చెందిన ఆహారాన్ని సేవించి ప్రార్థనలో పాల్గొనాలి.

ఉపవాసము అంటే దైవమునకు సమీపమున వసించుట. మనస్సును దైవము చెంతకు చేర్చుట. శరీరాన్ని మాడ్చటం కాదు. మన సాధనకు శరీరం సహకరించాలి. కనుక ఆహార విహారాలు నియమబద్ధం కావాలి. అందువల్ల ప్రార్థనముందు తగు మాత్రం ఆహారం తీసుకోవాలి. ఘనాహారం కానీ ద్రవాహారం కానీ.

గృహస్థుడవై ఉండాలి. అన్నది. రెండవ నియమం.

ఆశ్రమాలు నాలుగు బ్రహ్మచర్య ఆశ్రమంలో మనం ఏమి చేయడానికి పుట్టామో దానికి కావలసిన శిక్షణ పొందుతాము. విద్య అంటే అర్థం ఇది. అంటే డ్యూటీలో చేరడానికి తయారీ.

గృహస్థాశ్రమం ఆ డ్యూటిలో చేరడం. ఒక వయస్సు వచ్చిన తర్వాత మనిషికి ఓపిక తగ్గుతుంది. అపుడు వ్యక్తి తాను తన డ్యూటీలో గ్రహించిన అనుభవాన్ని లోకానికి పంచిపెట్టాలి. ఓపిక ఉన్న వాళ్ళకు శిక్షణ ఇవ్వాలి. మనస్సుతో పని చేయాలి. ఇది వాన ప్రస్థం. ఆ తర్వాత యత్యాశ్రమం. పండిన పండు రాలినట్లు మన నుండి శరీరం రాలిపోయేటందుకు చేసే సాధన.

ఆశ్రమాలలో ప్రధానమైనది గృహస్థ ఆశ్రమం. ఆ ఆశ్రమంలో బాధ్యత నిర్వహణ ఉన్నది. పాత్ర పోషణ ఉన్నది. ఆ ఆశ్రమాన్ని చిన్నచూపు చూడటం దారుణమైన కలి ప్రభావం. పంచ మహా భూతముల లో వాయువు ఎటువంటిదో ఆశ్రమములలో గృహస్థం అటువంటిదని మను ధర్మశాస్త్రం చెబుతున్నది. గృహస్థాశ్రమం లేకపోతే మిగతా ఆశ్రమాలు మూడింటికీ బ్రతికే దిక్కు లేదు. అవి గృహస్థుమీద ఆధారపడి ఉన్నాయి. అతడు ధర్మంగా నడిస్తే అవి సక్రమంగా పని చేస్తాయి. గృహస్థుడిని యజమాని అంటాము. గృహకార్య నిర్వహణ. అనే మహాయజ్ఞానికి యజమాని అతడు. గృహస్థు తన పనితో లోకాన్ని అర్చిస్తాడు. ఆ తర్వాత ఆ విధి నిర్వహణకు పిల్లలను పెంచి పెద్ద చేస్తాడు. తాను చస్తే లోపల తన పనిని కొనసాగించడానికి మరో కార్యకర్తను అప్పగిస్తాడు. అందుకే సంతతి అను దారమును త్రెంచవద్దు అన్నారు సృష్టికి అమృతత్వాన్ని ప్రసాదిస్తున్నది. గృహస్థాశ్రమం సంతతిద్వారా, ఇది ఎంత అవసరం. ఎంత అదృష్టం, ఎంత అవకాశం.

ఆ విధంగా గృహం ఒక దేవాలయం. కాని నేడు ఆ సదాచారం పోయింది. జీవితంలో రుచి పోయింది పవిత్రతపోతే రుచి పోతుంది. సదాచారం పద్వినియోగం లేకపోతే దేహం కుళ్ళిపోతుంది. కనుకనే ఇన్ని రోగాలు. అమెరికాలో న్యూ బృందావన్‌ను సృష్టించుకున్నారు. గృహస్థాశ్రమ వైభవాన్ని ప్రతిష్ఠించుకున్నారు మనలో ఆ ఇచ్ఛ ఆ సంకల్పం కొఱవడింది.

మూడవ నియమం ప్రార్థనలో అనుసరించవలసిన పద్ధతి. ప్రార్థనలో మనసును నిలబెట్టే ప్రయత్నం చెయ్యకూడదు. ఏకాగ్రత వేరు కేంద్రీకరణ వేరు ఆధారాన్ని సిద్ధపరిస్తే మనసు అదే నిలబడుతుంది. చలించడం మనస్సు యొక్క స్వభావం. దాన్ని నీవు నిలబెట్టలేవు. మనస్సు పెద్దదా

దేవుడు పెద్దవాడా? నీ మనస్సుతో దేవుడిని పట్టడం సాధ్యమా? మనసును దేవునికి అప్పజెప్పడం మాత్రమే సాధ్యం.

మనస్సును గమనించు. అది ఎటు వెళుతున్నదో చూడు. అంతే చాలు అలా చేయడమంటే తాను వేరు. మనస్సు వేరు అని గుర్తించటం. అలా మనస్సును గమనిస్తున్నపుడు పూర్వ సంస్కారాల ఫలితంగా, మన రాగద్వేషాల ఫలితంగా, రకరకాల దృశ్యాలు కనబడతాయి. ఆ దృశ్యాలు ఎలాటివైనా వానిలో దైవాన్ని చూడడం అలవరచుకోవాలి. చివరికి ఆ దృశ్యాలన్నీ మాలిన్యాలన్నీ తొలగిపోయి, మనస్సు పరమ ప్రశాంతంగా మారుతుంది. పై నుంచి సందేశాలను స్వీకరించ గలుగుతుంది.

మరి ఈ పద్ధతి మన సంప్రదాయంలో ఉన్నదా? అష్టోత్తరములు, సహస్రనామములు ఏమిటి? మూర్తులు, నామములు అవి జరిపిస్తున్నపుడు మనస్సు ఆయా నామముల వైపు తిరుగుతున్నది. ఆ కదలికలలో ఒక లయ, ఒక ఊగు, ఒక నృత్యం ఏర్పడుతున్నది. ఆ నృత్యంలో మనసు కరిగి పోతున్నది. మహాజ్ఞాని అయిన భీష్ముడు స్వయంగా విష్ణు సహస్ర నామములను జపించాడు.

[29-5-88 న గురుపూజా వేదిక పై ఉదయం చేసిన ప్రవచన సారాంశం]

# ఆఫీసుల్లో అంతా కలసి జాతీయ గీతం పాడితే

సనాతన ధర్మంతో పరిపుష్టమైన జీవన విధానం మనది. మనం ఆ మార్గం నుండి ప్రక్కకు తొలగినపుడల్లా పెద్దలు వచ్చి తిరిగి బోధిస్తూ ఉంటారు. వారు కొత్తది ఏమీ చెప్పరు. ఆ సనాతన ధర్మంలో ఉన్న దానినే కొత్తగా చెపుతారు. దేశకాల పాత్రములకు అనుగుణంగా దాకచక్యంగా ఒడుపుగా మనకు వినబుద్ధి పుట్టేలా చెపుతారు ఎడిట్ చేసి, ఎరేంజ్ చేసి, ఒక జీవితంగా ఒక వెలుగుగా చెబుతారు. అలాంటి ఋషులు, మునులు ఏకాంతంగా సాధన చేసినట్లు దాఖలాలు కనపడవు. బృందములు బృందములుగా యజ్ఞాలు చేసేవారు వందల సంఖ్యలో సామూహికంగా సత్రయాగాది క్రతువులు జపతపములు చేసేవారు.

ఆయా పురాణాలను, భాగవత కథలను గొంతెత్తి చదువుతున్నప్పుడు వింటున్నపుడు కలిగే అనుభూతి వేరు. అలా వింటున్నప్పుడు-ఆశబ్దము, ఆ ఉచ్చారణ ఆనాదము మనలోని తంత్రులను మీటి మనలను ఏదో లోకం లోకి తీసుకు వెళతాయి. అపారమైన అనుభూతిని అందిస్తాయి. రాత్రి పూట అవి చదివి పడుకుంటే పీడ కలలు రావు. పేపరు చదివి పడుకుంటే అందులోని బెదిరింపులే కలలోకి వస్తారు.

కనుకనే శౌనకాది మహామునులు సూతుని చేత పురాణ కథలు చెప్పించుకుంటారు. గొంతెత్తి గానం చేయి మేము వింటాం అంటారు. భాగవతంలో విదుర మైత్రేయ సంవాదం ఉన్నది. విదురుడు అంటాడు. కథ ఆపవద్దు. ఆకలి వేసినపుడు ప్రక్కనే ఉన్న గంగ నీళ్ళు త్రాగుతాను.

నీ గానం ఆగకూడదు. ఆ గంగతోపాటు నీ నుండి జ్ఞాన గంగను కూడా స్వీకరిస్తూ ఉంటాను. ఈ జీవితమే నీ గానమై పోవాలి. నీ ధ్యానమైపోవాలి.

సామూహికమైన యజ్ఞ యాగాదులకు, జపతపాలకు, ప్రార్థనకు ఎంతో మహత్తు ఉంది. సామూహిక ప్రార్థన జరగని జాతిలో అంతః సూత్రం ఉండదు. ఎవరికి వారు గోత్ర నామములతో పూజలు జరిపించు కుంటున్నాం. గుడికి వెళ్ళినా కలిసి ప్రార్థనలూ, భజనలూ చేయడం లేదు. కనుకనే కులతత్వం, మతతత్వం పెరిగిపోతున్నాయి. ఉమ్మడి కుటుంబాలు విడిపోతున్నాయి.

ప్రభుత్వ కార్యాలయాలలో ప్రైవేటు సంస్థలలో విధి నిర్వహణను వందేమాతరంతో ప్రారంభించి జనగణమనతో ముగించే పద్ధతి స్వరాజ్యం రాగానే ప్రారంభమై ఉంటే – ఇంతటి మారణహోమం జరిగి ఉండేది కాదు. ఇన్ని చీలికలు వచ్చేవి కావు. ఎంతో ఎదుగుదల జరిగి ఉండేది ఆ సామూహిక ప్రార్థన నుండి ఎంతో శక్తి ఉద్భవించి ఉండేది. దేశమే మారి పోయి ఉండేది. అలా గొంతులు కలియడంవల్ల ఐక్యత కుదురుతుంది. శ్రుతి కుదురుతుంది సామూహిక సహజీవనం అలవాటు అవుతుంది. ఏకాత్మత కొనసాగుతుంది.

పూర్వం బృందాలుగా 300 సంవత్సరాలపాటు 1200 సంవత్సరాల పాటు సత్రయాగాలు జరిపేవారు. తండ్రి తర్వాత బిడ్డ ఆ తర్వాత అతడి బిడ్డ యాగాన్ని కొనసాగించేవారు.

పదిమందీ కలసి ప్రార్థన చేసినపుడు, ఆ నాదంలో గొంతులన్నీ ఒక్క గొంతై వినబడటం ద్వారా, ఒకే ప్రణవం, ఒకే గాయత్రి అంతటా వ్యాపిస్తుంది. ఆ నాదంలో శరీరం శరీరంలో నాదం ఓంకార మనే సముద్రపు అలలలో శరీరం తేలియాడే స్థితి. శరీరములు ఆ అనుభూతి

అనే గంగాజలంలో తేలిపోయే స్థితి. సామూహిక ప్రార్థనకు అంతటి శక్తి ఉన్నది. అంతటి విలువ ఉన్నది.

మనం తీర్థాలు సేవిస్తాం గంగలో మునుగుతాం. గతంలో ఎందరో పవిత్ర మూర్తులు బృందాలుగా స్నానాలు చేసిన చోట స్నానం చేస్తాం. ఆ బృందాలతో కలిసి పోతాం. మన ప్రజ్ఞ వారందరితో ఏకాత్మత చెంది వారందరితో కలిసి నీకు నమస్కరిస్తున్నాను. గంగమ్మ తల్లి అంటాం.

సామూహిక ప్రార్థనకూడా అభ్యాసంగా, వ్రతంగా, దీక్షగా జరిపితే ఇన్ని శరీరాల ద్వారా ఒకే వెలుగు వ్యక్తమౌతున్న దివ్యానుభూతి కలుగుతుంది. అలాంటి ఏ అనుభూతిలో శరీరాలు తేలియాడుతున్నాయో అదే అంతర్యామి.

ఆనాడు బృందావనంలో గోపికలు జరిపిన రాసలీల సామూహిక ప్రార్థనకు పరమావధి అది బృంద ఆవనము. సామూహిక సాక్షాత్కారము. ఆ వేణు గానంలో గోపికల భౌతికత్వం జారిపోయింది. ఆ నాదం వింటున్న దేహాలు ఉన్నాయి. కాని లేవు. ఆ దివ్యనాదంలో గోపికలంతా పరవశించారు. కరిగిపోయారు.

మళ్ళీ ఆ బృందావనతత్త్వం మాస్టర్ సి. వి. వి. యోగంలో సామూహిక ప్రార్థనగా అవతరించింది. ఆ ప్రార్థనలో బృందమంతా ఒకే దేహంగా పని చేస్తుంది. శరీరాలు "చార్జ్" అవుతాయి దివ్యత్వం దిగివస్తుంది.

మాస్టర్ సి.వి.వి. మరోమాట చెప్పారు. గ్రహనక్షత్రగతుల ప్రకారం కుంభరాశి ప్రభావంలో భూమి ఇప్పుడు ఉన్నది.మీనరాశి ప్రభావం ఉన్నపుడు సముద్రానికి అధిపత్యం వహించిన ఆంగ్లేయులు సామ్రాజ్యం పాలించారు. కుంభయుగంలో ఆకాశంలో శక్తి కలిగిన రాజ్యాలు అగ్రరాజ్యాలు అవుతాయి ఇది అంతరిక్ష యుగం. విమానాలు, రాకెట్లు ఉన్నవారిది ఆధిపత్యం. అందుకోసం అమెరికా రష్యాలు పోటీపడుతున్నాయి.

అలాగే ఈ కుంభయుగంలో బృందశక్తి మాత్రమే పని చేస్తుంది. ఒంటిశక్తి పనిచేయదు. పూర్వం సంస్కృతానికి ఉన్న ప్రాధాన్యం ఇపుడు ఆంగ్ల భాషకు వచ్చింది. కనుకనే సి. వి. వి అనే అక్షరాలను ఆయన మంత్రంగా ఇచ్చారు. మంత్రానికి ధ్వని ముఖ్యం. ధ్వని తరంగముల సముదాయం మంత్రం. ఆ మంత్రంద్వారా ఆయన సూక్ష్మశరీరం శాశ్వతమైన వెలుగుతో సాధకునికి అను సంధానం జరుపుతుంది. బీజాక్షరాలకు ఉండే ప్రభావం అది.

అలాగే ప్రార్థనలో కాలనియమం, స్థలనియమం పాటించాలి. రోజూ ఉదయం, సాయంత్రం ఒకే సమయంలో ఒకే స్థలంలో ప్రార్థన చేయాలి. నవీన సంధ్యావందనం అది. ఈ నియమాలు పాటించడం వల్ల భూమి యొక్క కుండలినికీ, వ్యక్తిలోని కుండలినికి అను సంధానం జరుగుతుంది. శరీరం చార్జి చేయబడిన బ్యాటరీలా అవుతుంది. వజ్రాయుధం వలె తయారవుతుంది. దివ్యశక్తి ప్రసారానికి వాహిక అవుతుంది.

[30–5–88 న గురుపూజా వేదికపై ఉదయం చేసిన ప్రవచన సారాంశం]

# లోపలి కాలుష్యాలను కడిగి వెయ్యాలంటే

ఈ శరీరానికి కారకుడు ఎవరో అతడు వ్యక్తం కావడానికి ఈ శరీరం పనికి రావాలి. అందుకే నిరంతర సాధన. అందుకే ప్రార్థన అయితే అతడు అలా వ్యక్తం కాకుండా ఏదో అడ్డుపడుతున్నది. చిమ్నీ మసి బారింది. దీపంలోని వెలుగు సరిగా బయటకు రావడంలేదు. మసి మరీ ఎక్కువయితే అసలు ఆ వెలుగే లేదా అనిపిస్తుంది. కనుక ఆ మసి తుడుచుకోవడం చేత కావాలి. మసి పట్టింది. చిమ్నీకి మాత్రమే లోపలఉన్న వాడికి మసి అంటదు. ఆ చిమ్నీని అనగా శరీరాన్ని శుభ్రం చేసుకోవడానికే ప్రార్థన, జపతపాలు.

"హృద్దేశే అర్జున తిష్ఠతి" అన్నాడు కృష్ణుడు గీతలో. అక్కడ హృదయం లోపల కూర్చొని ఉన్నాడు ఆ మసి తుడిచేసుకో అని అతడు చెప్పడు. నచ్చితే ఉంచేసుకో నచ్చకపోతే తుడుచుకో అంటాడు.

మరి ఈ మసి ఏమిటి? దీని కథ ఏమిటి? దానిని "బలాదివ నియోజితః" అన్నాడు. ఏదో శక్తి మనల్ని పట్టి చెడ్డ మార్గంలోకి తోసేస్తున్నది. అందువల్ల ఈ పాడు పనులన్నీ చేస్తున్నాం. వీటిని నువ్వే చేయిస్తున్నావా? అని అడుగుతాడు అర్జునుడు.

కృష్ణుని సమాధానం ఏమంటే-ఈ శరీరంఅనే వాహికను నీ కిచ్చాను. ఆ వాహనానికి అన్ని వాహనాలకు వలెనే - దుమ్ము పట్టక తప్పదు నీవు దానిని శుభ్రపరచక పోతే మరిన్ని మలినములు చేరక తప్పదు. ఆ విధంగా ఆ మలినముల ప్రభావం పెరుగుతుంది. నాప్రభావం కన్న నీ ప్రభావంకన్న వాటి ప్రభావం ఎక్కువవుతుంది.

కనబడదానికి మార్గం ఏమిటి? ఆ వ్రేళ్ళను, కొమ్మలను నరికి వేయడం అసంగ శస్త్రేణదృఢేన ఛిత్వా. అసంగం, అంటుకొనకుండుట అనే ఆయుధంతో, గట్టి మనస్సుతో వాటిని నరికివేయాలి.

ధైర్యంగా ఒక్కటే దెబ్బ కొట్టాలి. అలా దెబ్బ కొట్టాడు. కనుక వేమన మారాడు. ఒక్కసారి "ఛీ" అనుకున్నాడు. మారాడు. రేపు కొడదాం ఎల్లుండి కొడదాం అనేవాడు మారలేడు.

అయితే, అలా మారిన వాళ్ళ సంఖ్య చాల తక్కువ. కనుక నాకు నమస్కారము చేయి క్ర్యక్తం రహితం అయ్యేటట్లు నేను చూస్తాను. అన్నారు మాస్టర్ సి.వి.వి.

భగవానుడు చెప్పినదీ అదే.-మామేకం శరణం వ్రజ. అన్నింటినీ వదిలి నన్ను శరణాగతి పొందు. నీ యోగక్షేమం నేను వహిస్తాను.

మాస్టర్ సి.వి.వి. చూపిన మార్గాన్ని భృక్తరహిత తారకరాజయోగ మార్గం అంటారు. పూర్వ సంస్కారాల పట్టునుంచి, మనిషిని విడిపించి అతనిని నిజస్వరూపంలో తీర్చిదిద్దే పద్ధతి అది.

భగవద్గీత అంతా చెప్పిన తర్వాత భగవానుడు-నేను ధర్మాధర్మము లను వివరించి చెప్పాను. దాని ప్రకారం ముందుకు సాగు అన్నాడు. ఆ బరువు నా మీదే పెట్టావా? అందుకు నాకు నీ వెలుగు అవసరం అన్నాడు. అర్జునుడు సిద్ధపడిన వాడివి కనుక నీవు శరణాగతి పొందు మిగతాది నేను చూచుకుంటాను. అన్నాడు కృష్ణుడు.

అలా బద్ధ జీవులకు శరణాగతి మార్గాన్ని ఇవ్వడం కోసం సిద్ధ పురుషులు అవతరిస్తారు. కర్మను న్యూట్రలైజ్ చేసే పద్ధతిని ఉపదేశిస్తారు. చిన్న చిన్న సన్నివేశాల రూపంలో అనుభవాల రూపంలో ఇబ్బంది లేని విధంగా మనసు పరివర్తన చెందే వికాసం పొందే విధానాన్ని అందిస్తారు మాస్టర్ సి.వి.వి. అలాంటి వ్యక్తి.

[31-5-88 ఉదయం విజయవాడలో గురుపూజావేదికపై చేసిన ప్రవచన సారాంశం]

# పరమ గురువు కరుణిస్తే...

ఒక దీపం నుంచి మరో దీపం వెలగడానికి, ఒక జీవితాన్ని ఉదాహరణగా తీసుకొని మరో జీవితం రూపొందడానికి, సన్మార్గ నిర్దేశం కోసం మనలను సత్కర్మాచరణకు ఉన్ముఖులను చేయడానికి వచ్చే పండుగ వ్యాసపూర్ణిమ.

ఈ ధర్మం, ఈ వారసత్వ వైభవం మా గురుదేవుల నుంచి మాకు వచ్చింది. ఆ పైనుంచి వారికి వచ్చింది. శ్రీకృష్ణ ఉంతటివాడు తాను కొత్తదేదీ చెప్పడం లేదన్నాడు. జనకునివంటి రాజర్షులు దేనిని ఆచరించి తరించారో దానినే నీకు అర్థమయ్యే భాషలో చెపుతున్నాను అన్నాడు.

ఆ గురువు అనే వెలుగుకు నమస్కరించి ఆయన ఆశీస్సులు అందుకునే దివ్య అవకాశమే గురుపూజ వ్యాసమహర్షి నుంచి జగద్గురుత్వం వ్యక్తమైన పర్వదినం గురుపూర్ణిమ ఆ గురు పరంపర యొక్క ఆశీస్సులు చల్లని చంద్ర కిరణాలుగా మనసు తాకి మనలో జ్ఞానబీజాలు మొలకెత్తజేసే రోజు.

సత్యవతీ పరాశరుల కలయిక ద్వారా జన్మించినాడు వ్యాసుడు. ఆ కథ ఏమిటి? దాని అర్థం ఏమిటి?

యమునలో ధర్మార్థమై పడవ నడిపే సత్యవతితో పరాశరుడు ఒక రోజున "నీ పడవ-ఎక్కుతాను" అన్నాడు. పడవ నడుస్తూ ఉండగా, "నీ నుంచి సంతానం పొందాలని ఉంది. అవకాశం ఇస్తావా?" అని అడిగాడు. "మహాత్ములు కారణం లేనిదే ఏదీ అడగరు. కాని స్వామి, నేను మత్స్యగంధిని. నా శరీరం దుర్వాసన కొడుతున్నది. అది మీ పొందుకు పనికి వస్తుందా" అన్నది సత్యవతి.

"దానికేమి. ఇప్పుడే నీవు యోజన గంధివి అయినావు. నీ నుంచి వచ్చే సువాసన యోజనం వరకు వ్యాపిస్తుంది. ఇది నీకు ఆజన్మాంతం ఉంటుంది." అన్నాడు పరాశరుడు.

"ఇది బట్టబయలు. పట్టపగలు. ఎలా సాధ్యం?" అన్నది సత్యవతి.

"దానికేమి. ఇప్పుడే చీకటి ఆవరిస్తుంది. ఇంక నీకు అడ్డమేమి?" అన్నాడు పరాశరుడు.

"ఇంకేమీ లేదు ప్రభూ"- అన్నది సత్యవతి. అలాంటి దివ్య సన్నివేశంలో సద్యోగర్భాన అప్పటికప్పుడు వేదవ్యాస మహర్షి యోగిగా జన్మించాడు. తల్లికి నమస్కరించి, "నీవు ఎప్పుడు తలచుకుంటే అప్పుడు వస్తాను. తండ్రి అప్పగించిన పని కోసం వెళుతున్నాను." అని కృష్ణ ద్వీపానికి వెళ్ళిపోయాడు.

మానవుడు పుట్టక ముందు పరమ పవిత్రమైన దివ్యాంశ జన్మలు ఎత్తిన తర్వాత కాంక్షలు కారణంగా ఒక రకమైన మత్స్యగంధత్వం అతనికి వస్తుంది. పూర్వజన్మ వాసనలు అతనిని చుట్టుకుని ఉంటాయి. ఒక శుభవేళ పరమ గురువు స్పర్శ తగిలినప్పుడు, ఆ దివ్య స్పర్శవల్ల అతడు పూర్వజన్మవాసనల నుంచి బయటపడి పూర్వ తేజస్సుగా భాసిస్తాడు.

శిష్యునికి లోకంలో తనకొక ప్రాత ఉన్నదనే స్పృహ ఉంటుంది. వాసన సంచయమైన స్థితి అది. పరాశర స్పర్శ ఫలితంగా, గురువు తాకిన ఫలితంగా లోకముయెడ స్పృహ కరిగిపోతుంది. దేహము యెడ స్పృహ కరిగిపోతుంది. అతడు లోకంలో ఉంటాడు. కాని లోకంతో కాక గురువుతో ఉంటాడు. అతడు వృత్తి వ్యాపారాలలో ఉన్నప్పటికీ గురువుతో అతని సంగమం నిరంతరంగా కొనసాగుతుంది. కర్తవ్యం. అతని

నుంచి వ్యక్తమవుతుంది. గురు శిష్యుల ఏకాంత స్థితి జన్మ జన్మల పర్యంతం కొనసాగుతుంది.

మనిషిలోపల ఉన్న తేజస్సు సత్యవతి పరాశర స్పర్శ వల్ల–గురు స్పర్శవల్ల ఆ తేజస్సు నుంచి వ్యాసుడు అనే వివేకం పుత్రుడుగా జన్మిస్తుంది. వ్యాసుడు వేదములను ఎడిట్ చేసి, నాలుగు వేదములుగా తీర్చిదిద్దినట్లు ఈ వివేకం మనిషి జీవితాన్ని అయోమయ స్థితి నుంచి చక్కదిద్ది దివ్యస్థితికి తీసుకువెళుతుంది.

ప్రతి మనిషి జీవితంలోనూ జరిగే కథ ఇది. కాలమనే యమునలో, దేహమనే పడవలో ఉండి ధర్మార్థం మనిషి పడవ నడుపుతూన్న వేళ– పరాశరుడనే గురుమూర్తి తానుగా వచ్చి అడుగుతాడు. మన అభ్యంతరాలు తొలగిస్తాడు. తన స్పర్శతో వివేకమనే పుత్రుడిని ఇస్తాడు.

వివేకం ఉదయించినప్పుడు మనిషి సాక్షిగా జీవితాన్ని చూడ గలుగుతాడు, జీవిత సన్నివేశాలలో తనను కూడా ఒక పాత్రగా చూడ గలుగుతాడు. 'ఇన్వాల్వ్' కాకుండా ఇరుక్కోకుండా, తన జీవితాన్ని చూడగలుగుతాడు పరాశర స్పర్శ ఫలితంగా జీవితం ఎక్కడ వ్యక్తమవుతోందో ఆ బిందువు వద్ద నిలబడి జీవితాన్ని చూచే స్థితి మనిషికి కలుగుతుంది. సాక్షి అంటే "స అక్షి" కన్ను కలిగినవాడు. తనను తాను చూడగలిగినవాడు. తన జీవితాన్ని తాను ఇతిహాసంగా వ్రాయగలిగినవాడు.

మరి ఈ చావుపుట్టుకల కథ అంతా ఎందుకు? ఆనందం కోసం. మనం పిచ్చుక గూళ్లు కడతాం. ఆ తర్వాత వాటిమీద నుంచి నడచి వచ్చేస్తాం. అవి శాశ్వతం కాదు. మరి కట్టడం ఎందుకు? ఆనందం కోసం.

ఇలాంటి సంప్రదాయాన్ని ఇలాంటి సత్య దర్శనాన్ని ఇచ్చిన ఈ గడ్డయొక్క రుణం మనం తీర్చుకోగలమా? మళ్ళీ మళ్ళీ ఇక్కడే జన్మిద్దాం. జన్మరాహిత్యం అంటే పుట్టకుండా ఉండడం కాదు. జన్మను ఒక గాథగా చూచే దృష్టితో జన్మించడం.

ఇదీ గురు పూర్ణిమ ఇచ్చే ఉపదేశం. ఆ పరమ గురువుల స్పర్శ మనకు నిండుగా లభించుగాక. మన జీవితాలు మనకు గాథలుగా గోచరించుగాక. మన జీవితాల నుండి మనకు బోధలు నిరంతరము వినబడుచుండుగాక. మన జీవిత కావ్యములోని నవరసములను మనము చక్కగా అనుభవింతుముగాక ధర్మాధర్మముల విశ్లేషణను దర్శించి, ఈ మహత్తర వైచిత్రిని అనుభవించడానికి మరల మరల ఈ భూమికి దిగివత్తుముగాక.

[27-7-88న గురుపూర్ణిమ సందర్భంగా విజయవాడలో చేసిన ప్రవచన సారాంశం]

# దేవతలు ఎందరు?
# పితృదేవతలు ఎవరు ?

మన ధర్మం సనాతనం. అంటే నిత్య నూతనం. సిద్ధపురుషులు దిగివచ్చి ఆ సనాతన ధర్మం నుంచి దేశకాలపాత్రములకు కావలసిన జ్ఞాన గంగను అందిస్తూ వచ్చారు అదే గురుపరంపర.

అలాగే యోగం ఈనాటిది కాదు. ఏదో కొత్త యోగం కాదు. యోగంతిరిగిన ఒక కొత్తమలుపు. మహాపురుషులు యోగసాధన మార్గాన్ని దేశకాలాలను అనుసరించి మలుపులు త్రిప్పుతూ వచ్చారు. మార్గం ఒక్కటే. వారు మైలురాళ్ళు మాత్రమే. కణ్వుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, భరద్వాజుడు- వీరంతా వేర్వేరు యోగాలు చెప్పారా?

మానవ మనస్తత్వంలో వైవిధ్యం ఉన్నది కనుక యోగసాధన నియమాలలో వైవిధ్యం ఉండాలి. అది వైవిధ్యమేకాని వైరుధ్యం కాదు.

సనాతన ధర్మంలో మతం అంటే అభిప్రాయం. అధ్యాత్మిక మార్గం కాదు. రామమతం, కృష్ణమతం ఉన్నాయా? బౌద్ధం మతంఅయిన తర్వాత మన దేశంలో మిగుల లేదు. ఇప్పుడు క్రైస్తవం వస్తోంది చివరికి క్రీస్తు మిగులుతాడు. మతం వెళ్ళిపోతుంది. ఇది చారిత్రక సత్యం. నన్ను అనుసరించేవారు తమను వేరుగా గుర్తించుకొనకుందురుగాక. ప్రపంచం యొక్క జీవన స్రవంతిలో స్రుతి కలుపుదురుగాక- అని ఏసుక్రీస్తు బోధించాడు. అది తప్ప మిగతాది అంతా జరుగుతోంది ఇప్పుడు.

వేదవ్యాసుని జన్మకథకు వద్దాం. ఈ.కె. మాస్టరుగారు వ్రాసిన "పురాణ పురుషుడు" నవలలో సత్యవతి వ్యాసుడిని అడిగింది–"మీ నాన్నకు ఆ క్షణంలో ఉన్నది కామదృష్టా? ధర్మదృష్టా? చేను దున్నుతున్న రైతుకు భూమిపైన దృష్టి ఉన్నదా, పంటపైన దృష్టి ఉన్నదా? పంటపైననే దృష్టి ఉన్నది. నిన్ను పొందడం అనేది ఆయన ప్రయోజనంగా పెట్టుకున్నాడు.

నన్ను పొందడం కాదు. కనుకనే నీవు ధర్మమూర్తివై ఆవిర్భవించావు. దేశకాలములను సమీక్షించిన పరాశరుడు ఒక జగద్గురువుకు జన్మ ఇవ్వదలచి నన్ను ఉపాధిగా స్వీకరించాడు.

కామదృష్టితోకాక ధర్మ దృష్టితో దాంపత్యం అంటే ఏమిటో ఆ మహనీయుని వర్చస్సులో చూడవలసిందే. ఎంత ఎదగాలి మానవజాతి? ధర్మదృష్టితో దాంపత్యం చేసే స్థితికి ఎంత ఎదగాలి?

ఆ వ్యాసుడు ఏమి చేశాడు? వేద విభాగం చేశాడు. ఆ జీవిత సారాన్ని ఉపనిషత్తులుగా ఎడిట్ చేశాడు. ఆ జీవితాన్ని బ్రహ్మసూత్రములుగా సూత్రీకరణ చేశాడు. ఎక్కడనుంచి ఈ సృష్టి కథ ప్రారంభమైనదో, ఆ కథలోని మెట్లను, ఈ అంచెలంచెల సృష్టి క్రమాన్ని అష్టాదశ పురాణాలలో వర్ణించాడు. కనుక ఆ వాఙ్మయం శాశ్వతం. మనం ఎంత చదవక పోయినా దానికి చావు లేదు. భారతీయులు చదవడం మానిన క్షణంలో ప్రపంచ ప్రజలు అనేకరెట్లుగా వాటిని చదువుతున్నారు. వాటిమీద పరిశోధనలు జరుపుతున్నారు. విష్ణుపురాణంలోని పారిభాషిక పదాల అర్థాలు వెదుకుతున్నారు.

కాని, మనకు పురాణాలు తెలియవు. కనీసం పితృదేవతలు అంటే తెలియదు. దేవతలు సూర్యుని నుండి దిగివచ్చిన వారు. సృష్టిని నిర్మాణం చేస్తున్నవారు. పితృదేవతలు చంద్రుని నుంచి దిగివచ్చి దాంపత్య ధర్మం ద్వారా ఈ సృష్టి నిలబడేటట్లు చేస్తున్నారు. ఈ మాట మనకు ఇప్పుడు విదేశీయులు చెప్పవలసి వస్తోంది.

అలాగే– 33 కోట్ల దేవతలు అంటే అర్థం ఏమిటి? కోటి అంటే అంచు అని అర్థం. 'కామకోటి' అంటే ధర్మార్థ కామమోక్షములలో కామానికి చివర ఉన్న మోక్షము అని అర్థం. 33 కోట్లు అంటే అన్ని కోణములు, అన్ని విభాగములు అని అర్థం.

కాగా – వేదవ్యాసుని వలెనే ఏసుక్రీస్తు కూడా కన్యాపుత్రుడే. మేరీ మాతకు దేవతల కరుణవల్ల బిడ్డ కలిగాడు. భర్త వడ్రంగి. అనగా

మనస్సుతో ఇంద్రియములతో కూడిన జీవన వ్యాపారమును నియమబద్ధం చేసుకున్న వ్యక్తి. అక్కడ సత్యవతి ధర్మార్థంగా పడవ నడుపుతున్నది. ఇక్కడ ఆ వ్రదంగి తన జీవితాన్ని తీర్చిదిద్దుకుంటున్నాడు, వివేకం అక్కడ వ్యాసుడుగా, ఇక్కడ క్రీస్తుగా జన్మఎత్తింది.

"నన్నుఆ తండ్రి పంపాడు. మనమంతా ఆ తండ్రి రాజ్యానికి వారసులం. ఆయన సామ్రాజ్యంగా ఈ భూమిని తీర్చిదిద్దుకుందాం"- అని క్రీస్తు సందేశం ఇచ్చాడు. ఇదీ కన్యాపుత్రుని కథ.

నేనొక సందర్భంలో అన్నాను- "భారతదేశమున క్రైస్తవము వ్యాపించుచున్నది. ఇక భారతీయుడు క్రైస్తవమునకు భాష్యము చెప్పవలసి యున్నది. ఎందుకనగా- ఆ మతము అనే నది ఈ సనాతన ధర్మం అనే సముద్రంలో సంగమించవలసినదే".

అలాగే- హెలీనా పెట్రోవా బ్లావెట్స్కీ వజ్రపు తునక వంటి ఒక మాట అన్నది- "ఓ నాస్తికులారా! వేదాలను మీరు కాల్చివేయవచ్చు, నరజాతి నాశనం కావచ్చు. అయినా సృష్టిలో తిరిగి మానవ ఆవిర్భావం జరిగినప్పుడు మానవుడి చర్మం అనే కాగితంపైన రక్తాక్షరాలతో వేదం అపౌరుషేయమై వ్యక్తమవుతుంది ఈ వేద సంప్రదాయాన్ని ఎవరూ ఏమీ చేయలేరు. అది అవిచ్ఛిన్నంగా సాగిపోవలసిందే.

అలాంటి వేదములను విభాగం చేసిన జ్ఞాననిధి, మహా వ్యాఖ్యాన కారుడు అయిన వ్యాసభగవానునికి ఈ గురుపూర్ణిమనాడు నమస్కరించు కుందాం. ఆ మహనీయుల స్పర్శవల్ల మనలోని సత్యవతి యోజనగంధి అయి వేదవ్యాసునకు జన్మ ఇచ్చుగాక. మనయందు వివేకము ఉదయించు గాక. ఆ వివేకమను వెలుగులో మన జీవిత వేదము విభాగింపబడును గాక. జీవిత సారము ఉపనిషత్తులగును గాక. జీవితములో ఇంతవరకు జరిగిన ప్రయాణము పురాణములై వర్ధిల్లుగాక. ఇకపై జరుగు ప్రయాణమున ఇతి హాసమై వ్యక్తమగునుగాక.

[28-7-88న గురుపూర్ణిమ సందర్భంగా విజయవాడలో ఇచ్చిన ప్రవచన సారాంశము]

# తొలి సంకీర్తన వేదం

భగవన్నామాన్ని సంకీర్తన చేస్తున్నప్పుడు మన నీతులు కదులుతూ ఉంటాయి. మనస్సు ఆ భగవద్ భావనలో ఓలలాడుతూ ఉంటుంది. ఆ విధంగా మనస్సుకు, వాక్కుకు, కరములకు అనుసంధానం జరుగుతుంది ఈ త్రికరణములకు శ్రుతి కుదిరిన వేళ మనిషికి పారవశ్యం కలుగుతోంది. అతడు తనయందు తాను కరగిపోతున్నాడు. మనస్సు హృదయంలో కరిగిపోతున్నది.

ఇలా ఒక్కొక్కసారి ఒక్కొక్క మహానుభావుని దగ్గర, ఒక్కొక్క గ్రంథంలో, ఒక్కొక్క సంప్రదాయంలో పారవశ్యం కలుగుతుంది. దివ్య అనుభూతి కలుగుతుంది అతడి సంస్కారాన్ని బట్టి.

నది సముద్రంలో కలియడం సహజం. భౌగోళిక స్థితినిబట్టి సముద్రాలను వేర్వేరు పేర్లతో పిలుస్తాం. బంగాళాఖాతమనీ, అరేబియా సముద్రమనీ, నిజానికి ఇన్ని సముద్రాలు లేవు. సముద్రం ఒక్కటే

నది సముద్రంలో కలసినట్లు—ఇలా మన మనస్సు ఎక్కడ కరుగుతుందో అక్కడ మనకు ఆరాధనా భావం ఏర్పడుతుంది మనమంటే ఏమిటో మనకు తెలుస్తుంది. దానినే పెద్దలు ఆత్మసాక్షాత్కారం అన్నారు.

సంకీర్తనం, గొంతెత్తిగానం చేయడం అనాదిగా వస్తున్న సంప్రదాయం. వేదములు, ఉపనిషత్తులు అలా గానం చేయబడినవే. ఇప్పుడు కొందరు అంటున్నారు—గాయత్రీ మంత్రాన్ని వేదమంత్రాన్ని

అపవిత్రులు వింటే అవి అపవిత్రం అయిపోతాయి కనుక వాటిని గొణు క్కోండి అని.

మరి—ఒకడు విన్నంత మాత్రాన అపవిత్రం అయిపోయే మంత్రం మనల్ని ఎలా పవిత్రులను చేస్తుంది? అదే నిజమైతే- ఆ మంత్రం మనవరకు నడచివచ్చేదా ? ఉద్ధత—గొంతెత్తి చదువు అని చెపుతోంది శాస్త్రం.

నిజానికి ఈ సృష్టిలోని మొదటి సంకీర్తన వేదమే. "సహస్ర శీర్షా పురుషః" అంటూ వంద, నూటయాభైమంది కలసి సంయుక్తంగా గానం చేస్తూ ఉంటే ఎంత బాగుంటుంది?

మనం చేసే సంకీర్తన తొలి సంకీర్తన అయిన ఆ వేదమునందు పర్యవసించాలి.

అలాగే మంత్రాన్ని విరిచి చదవడం తప్పు. అనుభూతిని కోల్పోయే పద్ధతి అది. లక్ష్మీసహస్ర నామాలుకాని, విష్ణు సహస్ర నామాలుకాని, లలితా సహస్ర నామాలుకాని గొంతెత్తి గానం చేయాలి. హాయిగా, తీయగా, వాటి నడుములు విరగగొట్టకూడదు.

అసలు ఈ గానం ఎక్కడ నుండి పుట్టుతున్నది ? సృష్టిలో అంతర్లీనంగా ఉన్నదే ఇది. ఈ సృష్టి ఒక చిత్రమైన సంకీర్తన నవ గ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయి. ఆ తిరగడంలో ఒక రిథిమ్ ఉంది. ఒక లయ ఉంది. ఒక గానం వుంది. మన గానం ఆ విశ్వ గానంతో శ్రుతికలపాలి.

గాయత్రీ ఛందస్సులో 24 అక్షరాలు ఉన్నాయి. సంవత్సరంలో 12 పూర్ణిమలు, 12 అమావాస్యలు ఉన్నాయి. అది సంవత్సర పురుషుని గానం. సృష్టియొక్క సంకీర్తన.

మనహృదయంలోను ఒక సంకీర్తన జరుగుతోంది-లబ్‌దబ్ అంటూ లయబద్ధంగా, ఆ గానంపైనే మన బ్రతుకు, మన కార్యకలాపాలు అన్నీ ఆధారపడి ఉన్నాయి.

ఆ హృదయంలో మనస్సు ఇంద్రియములు కరిగినప్పుడు మన జీవితంలోని సన్నివేశములు ఆ సంకీర్తనలో చరణములై, భాగములై, పల్లవులై భాసిస్తాయి. మన జీవిత గానం విశ్వగానంలో, సృష్టిగానంలో శ్రుతి కలుపుతుంది.

బొమ్మ ఉంది. ఆ బొమ్మలో గీత ఉంది. ఆ గీత ఆ బొమ్మలో భాగం. మనిషికూడా అలాగే సృష్టిలో ఒక భాగం.

ఇలా సృష్టిగానంలో శ్రుతి కలపడమే జీవన్ముక్త స్థితి. భగవానుడు విశ్వరూపం చూపింది ఆ స్థితిని కల్పించడం కోసమే.

నామ సంకీర్తన చేస్తున్నప్పుడు మనం చేతులు కలుపుతున్నాం. కాని బయటి జీవితంలో చేతులు నలపడమే, ప్రాధేయపడడమే కనబడుతోంది. మన సంస్కృతి చేతులు కలపడం నేర్పుతోంది. చేతులు నలపడంకాదు. పరాయిపాలన కారణంగా ఈ చేతులు నలిపే సంస్కృతి వచ్చింది. ఒకరు మరొకరికి లొంగి ఉండే స్థితి వచ్చింది

మానవాతీత వ్యక్తిత్వాలు కలిగిన వ్యక్తులు ఆ భగవంతుని నుంచి దిగివచ్చి ఇందుకోసం మనకు ప్రేరణ కలిగిస్తారు స్తబ్ధతనుంచి చైతన్యానికి ధర్మగ్లాని నుండి ధర్మపథంలోకి మనల్ని నడిపిస్తారు.

ఆ విధంగా మన గానాన్ని విశ్వగానంతో శ్రుతి కలిపే స్థితికి మనం ఎదగాలి. ఆ ఏకాత్మత మనలో వర్ధిల్లె స్థితి రావాలి. ఆ దివ్య స్థితికి ఉన్ముఖం కావడమే నామసంకీర్తనలోని పరమార్థం.

31-7-89న విజయవాడలోని సత్యసాయి నిలయంలో ఇచ్చిన [ప్రవచన సారాంశం]

# తరాల అంతరం తరిగి పోవాలంటే…

గతంలో మీనరాశి ప్రభావం ఉన్నప్పుడు జలాధిపత్యం కలిగిన దేశాలు సామ్రాజ్యాలు ఏలాయి. ఇప్పుడు కుంభరాశి ప్రభావం వచ్చింది. ఆకాశంపై ఆధిపత్యం కలిగిన దేశాలకే ప్రాబల్యం.

మేడమ్ బ్లావెట్ స్కీ మరోమాట చెప్పింది. 19వ శతాబ్దంలో మనిషి పదార్థానికి దాసుడు. 20వ శతాబ్దంలో అతడు ఆకాశానికి అధిపతి అవుతాడు అని. ఈ మాట ఆమె 19వ శతాబ్దంలోనే చెప్పింది.

ఈ కుంభయుగ ప్రభావం వల్ల రవాణా సౌకర్యాలు పెరిగాయి. దేశాల మధ్య దారులు తెరచుకున్నాయి: దేశాలు దగ్గరైపోయాయి. పంచ భూతాలతో విచిత్రాలు చేస్తున్నారు. యురేనస్ [వరుణుడు], నెప్ట్యూన్ [ఇంద్రుడు], ప్లూటో అనే కొత్త గ్రహాల ప్రభావం పడుతోంది. ముఖ్యంగా వరుణ గ్రహం ప్రభావం హెచ్చుగా ఉంది. ఆ గ్రహాన్ని నడిపించే దివ్య శక్తి అగస్త్య మహర్షికి ఉంది. ఆ అగస్త్య మహర్షి కుంభసంభవుడు, కుండలో పుట్టినవాడని కథ. ఇదంతా కట్టుకథ అని కొందరు అనుకోవచ్చు కాని—జ్యోతిర్విద్య అనే కన్ను లేకుండా వేద శాస్త్రములను, ఉపనిషత్తులను చదవకూడదు. వాటికి ఒక ప్రత్యేక భాష ఉంది. 'కోడ్' ఉంది. అవి అర్థం కావాలంటే జ్యోతిషం తెలియాలి. కుంభ రాశికీ, అగస్త్యునికీ ఉన్న సంబంధం జ్యోతిషానికి సంబంధించిన కథ.

ఒకప్పుడు వింధ్య పర్వతం బాగా పెరిగిపోయింది. భూమిలో కొంత భాగంలో రోజంతా పగలయింది. కొంత భాగంలో రోజంతా రాత్రయింది. ప్రజలు గగ్గోలు పడ్డారు. అగస్త్యుడు భార్యతో బయలు

దేరాడు. దక్షిణాది వెళ్ళాలి, దిగిరా అన్నాడు వింధ్యతో. వింధ్య దిగి వచ్చింది. తిరిగి వచ్చే వరకు అలాగే ఉండు-అన్నాడు. మరి తిరిగి రాలేదు నీలగిరిలో ఉండిపోయాడు. ఇప్పుడూ అక్కడే ఉన్నాడు. కనులారా చూడాలని మనసారా కోరుకున్న వారికి కనబడతాడు. ఆల్బర్ట్ శశి అనే విదేశీయుడు అక్కడ ఆశ్రమం కట్టుకున్నాడు. అలా కోరు కున్నాడు. అగస్త్యుని దర్శించాడు. అంతేకాదు, తాను దర్శించిన మూర్తి బొమ్మ వేశాడు. ఆ బొమ్మ కొన్ని వేల ప్రింట్లు ఇప్పుడు వివిధ దేశాలలో పూజామందిరాలలో ఉన్నాయి. నా వద్ద కూడా ఒకటి ఉంది.

మహర్షులు, అవతారమూర్తులు ఎపుడు పిలిస్తే అప్పుడు ఎక్కడ పిలిస్తే అక్కడ వ్యక్తమవుతారు. ఆ పిలుపులో ఆర్తి ఉంటే.

ఆ అగస్త్య మహర్షి తేజస్సు మాస్టర్ సి.వి.వి.గా వ్యక్తమయింది. ఈ యుగ చైతన్యాన్ని నడిపించడం కోసం.

మనిషి అమృతత్వాన్ని సాధించాలి. అతడు పరిపూర్ణుడు కావాలి. అతనికి తెలియనిదంటూ ఉండకూడదు. ఇదీ కుంభరాశికి సంకేతం.

మాస్టర్ సి.వి.వి. మొదటి భార్య చనిపోయింది. ఆమె ఏ లోకానికి వెళ్ళింది? మృత్యువు ఆవల ఏముంది? ఈ లోకాలమధ్య ద్వారాలు తెరవ డానికి ఎందుకు ప్రయత్నించకూడదు ? అని ఆయన ప్రశ్నించు కున్నారు

తన రెండవ భార్య వెంకమ్మగారు మీడియంగా స్థూల, సూక్ష్మ లోకాల మధ్య ద్వారాలను తెరిపించారు ఆయన. ఆమె పెంపుడు తల్లి మరణించింది. మరణించలేదన్నారు సివివి. 16 రోజులు ఆ దేహాన్ని అలాగే ఉంచారు. ఆ మరునాడు ఆమె నిద్ర లేచినట్లు లేచింది. తర్వాత మూడున్నర సంవత్సరాలు బ్రతికింది.

ఆయనకు 'చందు' అనే కొడుకు పుట్టాడు. రెండవ ఏటనే శరీరం విడిచాడు. ఆయన చెప్పిన మీదట వెంకమ్మగారు మరో లోకానికి వెళ్లి ఆ బిడ్డను తెచ్చుకున్నారు. అలా మూడు మారులు జరిగింది. ఆ విధంగా ఆయన స్థూల సూక్ష్మ లోకాల మధ్య అనుసంధానం చేశారు.

కాగా, తాను నమ్మిన వాడు మాత్రమే దేవుడనీ, ఇతరులు దేవుళ్ళు కారనీ ఎన్నడూ భావించకూడదు. రాముడు దిగివచ్చినా, కృష్ణుడు దిగి వచ్చినా దేశకాల పాత్రాలను బట్టి ఒకే దైవం ఆయా రూపాలు ధరిస్తున్నాడు. ఆ దైవశక్తి ఎక్కడ ఎంతవరకు అవసరమో అక్కడ అంతవరకు వ్యక్తమవుతుంది ఆ అవతారాల కార్యక్రమాన్ని బట్టి దేవుని శక్తిని అంచనా వేయకూడదు. రాముడు మానవుడుగా జన్మించాడు. రావణాసురుడిని చంపాలి కనుక.

అలాగే, గీతోపదేశ సమయంలో అవసరమైంది కనుక కృష్ణుడు విశ్వరూపం చూపాడు. ద్వారక వీధులలో అలా తిరగలేదు. అసలు ఆ విశ్వరూపం చూపేవరకూ తన బావగారికి ఇంత జ్ఞానం ఉన్నట్లు, ఇంత శక్తి ఉన్నట్లు అర్జునుడికి తెలియదు. ఆ శక్తిని ప్రకటించే సందర్భం రాలేదు కనుక. అలాగే యాదవులకు తెలిసిన కృష్ణుడు కష్టాలలో ఆదుకునేవాడు. పాండవులకు తెలిసిన కృష్ణుడు మానవజీవితానికి శిక్షణ ఇచ్చే పరమ గురువు. వ్రేపల్లెలో వినిపించిన వేణుగానం ద్వారకలో వినిపించ లేదు.

కనుక ఒక దేవుడు ఎక్కువనీ, మరో దేవుడు తక్కువని భావించడం మనిషిలోని బలహీనత మాత్రమే. ఆ దేవుడు తన సామర్థ్యం అంతటినీ చూపడు. నీవు అపేక్షించిన మేరకే చూపుతాడు.

అయా వ్యక్తుల సంస్కారాన్ని బట్టి, కర్తవ్యాన్ని బట్టి, జీవ లక్ష్యాన్ని బట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క అవతార మూర్తి నచ్చుతాడు. ఇన్ని మూర్తులూ ఆ దివ్య చైతన్యానివే.

మరొక్క మాట. ఈనాడు దేశాలు దగ్గరైనాయి కనుక, వివిధ సంస్కృతుల మధ్య అవగాహన, సమన్వయం అవసరం అవుతోంది. పవిత్ర గ్రంథముల సమగ్ర శాస్త్రీయ వివరణ కావాలి. మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్య తమ భాగవత రహస్య ప్రకాశం ద్వారా అలాంటి పని చేశారు. పైగా ఈ కుంభయుగం పిల్లలు దేనినీ గ్రుడ్డిగా నమ్మరు. ప్రశ్నలు వేస్తున్నారు. ఈ పిల్లల్ని పెంచడానికి మనం ఎంతవరకు తగుదుము అని తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఆత్మ పరిశీలన చేసుకోవాలి. దబాయించి ప్రయోజనం లేదు. తపస్సు కావాలి. గ్రంథ రచన సాగాలి. ఆ విధంగా తరాల అంతరాన్ని తగ్గించాలి. పిల్లలు 'పర్వర్ట్' కాకుండా చూచుకోవాలి. నవయుగ నిర్మాతలు కావలసింది వాళ్ళే కనుక, వాళ్ళను సక్రమంగా తీర్చి దిద్దే పాత్రతను మనం సంపాదించాలి.

[4-8-1988 మాస్టర్ సి. వి. వి. జన్మదిన సందర్భంగా విజయవాడలో చేసిన ప్రవచన సారాంశం]

# అది ఒక వెలుగుల వెల్లువ

ఎందరో మహానుభావులు...

అది ఒక వెలుగుల వెల్లువ. స్వామి వివేకానంద అమెరికాలో సనాతన ధర్మ ధ్వజాన్ని ఎగురవేసి స్వదేశానికి తిరిగివచ్చినప్పుడు, వేల మంది లక్షల మంది ఆయన వాణికి సమ్మోహితులు అవుతున్న వేళ... కొందరు ఆయనను అడిగారు మీలో ఆకర్షణ ఉంది. చక్కని వాక్కు ఉంది. చక్కని మూర్తి ఉంది. ఒక వెలుగు ముద్ద మీరు. తత్వ దర్శనం చెపుతున్నారు. సమన్వయం బోధిస్తున్నారు. కాని మీరు స్వరాజ్య ఉద్యమానికి సారథ్యం వహించకూడదా?"

చిరునవ్వు నవ్వి ఆయన అన్నారు—'నా జాతి స్వాతంత్ర్యానికి సిద్ధంగా ఉన్నదా? స్వాతంత్ర్యం పొందే పాత్రతను సంపాదించడం మరింత అవసరం. ఆ పని చేస్తున్నాను నేను. ఆ పాత్రతను పెంచడానికి యత్నిస్తున్నాను. జాతి పునర్నిర్మాణానికి పెద్ద యెత్తున శంఖారావం చేసింది ఆయనే.

ఉద్యమకారుడుగా, తీవ్రవాదిగా స్వేచ్ఛకోసంపనిచేసినఅరవిందునికి కారాగారంలో శ్రీ కృష్ణదర్శనం అయింది. 'ఉద్యమం వేడెక్కింది కనుక నీ కర్తవ్యం ఇక మలుపు తిరుగుతుంది. తత్వదర్శన మార్గాన పయనించు. ఆ మార్గంలో జాతికి బలాన్ని అందించు అన్న ఆదేశం వినిపించింది. ఆ ప్రేరణతో ఆయన తత్వదర్శనమూర్తి అయి, ద్రష్టఅయి, మహర్షి అయినాడు. పరిపూర్ణ యోగస్థితిని పొందినాడు. స్వేచ్ఛను సద్వినియోగం చేసుకోవడానికి కావలసిన పరిపూర్ణత కోసం ఎన్ని కోణాల నుండి కృషి

చేయాలో నవీన మానవుడికి తెలిపాడు. తన తపస్సును ధారపోసి పొందిన దర్శనాన్ని అందించాడు.

ఆయన ఒక మాట అన్నాడు. మానసికమైన శ్రమకూ, శారీరక మైన శ్రమకూ సమానమైన విలువ, ఆదాయం, గౌరవం ఇవ్వాలని, ఆర్థిక సమానతను మించిన భావన ఇది.

ఆయన వేదాల రహస్యాలను త్రవ్విపోశాడు. ఆయన వ్రాసిన "సావిత్రి" ఇరవైయవ శతాబ్దపు ఏకైక వేదకావ్యం.

మరో మహానుభావుడు రవీంద్రనాథ్ ఠాగూర్. 'స్వేచ్ఛ కావాలంటున్నారు కదా. ముందు పిల్లల్ని స్వేచ్ఛగా పెరగనివ్వండి. ప్రజ్ఞకు స్వేచ్ఛ ఇవ్వండి. పిల్లవాడికి ఏది కావాలో అది అందిస్తూ అతనిని సోకితే అతడు మహా విద్వాంసుడు అవుతాడు' అన్నాడు. శాంతినికేతన్‌లో అది చేసి చూపాడు. తోటలలో చెట్లక్రింద పాఠాలు చెప్పుకుందాం అన్నాడు. చెప్పించాడు. మరి ఇప్పుడో? బిల్డింగులు మిగులుతున్నాయి. 'కేరెక్టర్ బిల్డింగ్' ఎక్కడా కనబడదు. 'పిల్లలు మొగ్గలు. ఆ మొగ్గలను సహజంగా పువ్వులుగా వికసించనివ్వండి. ఆ రేకులు నలగగొట్టవద్దు. కమలగొట్ట వద్దు సిద్ధాంతలు వారిపై రుద్దవద్దు' అంటూ ఆర్ద్రమైన భావాలు వినిపించాడు. వాటిని అమలుపరచాడు.

బెజవాడ గోపాలరెడ్డిగారు తమ కవిత చదవగా వింటూ ఉంటే, సంజీవదేవ్‌గారిని చూస్తూ ఉంటే ఆ శాంతినికేతన్‌లోని స్వేచ్ఛా వాతావరణంలో వారి ప్రజ్ఞ ఎలా వికసించిందో మనకు అర్థమవుతుంది. ఆ సంజీవదేవ్‌గారికి తెలియని విషయమ్మంటూ లేదు.

కాగా ఆనాడు పాశ్చాత్యుల ప్రభావం వల్ల మనకు కొంత చెడూ కొంత మంచీ జరిగింది. ఈ బానిసలకు యుగాల తరబడి సాగి,

సంస్కృతి ఉండడమా? అని ఆంగ్ల పాలకులు కళ్ళల్లో నిప్పులు పోసుకున్నారు. ఆ 'సంస్కృతికి అంతటి చరిత్ర, వైభవమూ లేవని నిరూపించడానికి చేయగలిగినదంతా చేశారు. సాధ్యం కాలేదు. మరో ఎత్తు వేశారు. 'ఈ సంస్కృతి భారతీయులది కాదన్నారు. 'మా దేశాల వాళ్ళే ఉత్తర హిందూదేశం వచ్చారు ఆర్యులని పేరు పెట్టుకున్నారు' అని మరో కట్టు కథ అల్లారు ఆర్యుడు అనగా శ్రేష్ఠుడు. ఆ పదానికి జాతి అనే అర్థం లేదు సనాతన వాఙ్మయంలో. ఇంగ్లీషువాళ్ళు చేసిన ఈ వాదం వట్టి దగా. మోసం.

మరో కుట్ర. మేము ఏనాటివో చిల్ల పెంకులు చూచాం. పరిశోధించాం. దాని ప్రకారం చరిత్ర వ్రాశాం అన్నారు. కాని రామాయణం ఎపుడు జరిగిందో తిథి వార నక్షత్రాలతో ఆ గ్రంథంలోనే ఉంది. అలాగే భారతంలో. వాటినిబట్టి ఆయా వ్యక్తుల జాతకచక్రాలను వేయవచ్చు మరి' ఈ చిల్లపెంకు లెందుకు? ఈ బొమ్మ లెందుకు? భారతీయులను 'డిఫేమ్ చేయడానికి, బదనామ్ చేయడానికి.

మరో ఎత్తుగడ. వేదాలు ఆ రోజుల్లో జానపదులు పాడిన పాటలు (పోష్టరల్ సాంగ్స్) అనే వాదం లేవదీశారు. వాళ్ళు పంచభూతలకు భయపడి చేసిన స్తోత్రాలే వాయు, వరుణ సూక్తులు అన్నారు. షార్ట్‌హాండ్ పుస్తకం చూచి అవి పిచ్చి గీతలు అనుకున్నట్టు ఉందిది. ఆ మాటే నిజమైతే ఆ పుస్తకాలు ఇప్పటిదాకా ఉండవు.

పాశ్చాత్యులలో మంచివాళ్ళూ ఉన్నారు. సర్ జాన్, వుడ్రాఫ్ వంటి వాళ్ళు. ఆయన 'సర్పెంట్ పవర్.' శక్తి అండ్ శక్త అనే అద్భుత గ్రంథాలు వ్రాశాడు. "ప్రపంచంలో కొన్ని వందల దేశాలు ఇంకనూ కన్ను తెరవని వేళ భారత గడ్డపై ఒక పరిపూర్ణమైన సంస్కృతి వెల్లివిరిసినది. జీవిత పరమార్థం ఏమో వ్యక్తమైనది. ఈ భూమిని నా

జోహారులు" అని వ్రాశాడు. మనం పరమ పవిత్రంగా భావించదగిన గ్రంథాలు వ్రాశాడు. ఇక్కడి రూపే అక్కడ పుట్టి వ్రాశాడా అన్నట్లు వ్రాశాడు.

ఆంగ్ల పాలకుల కుతంత్రాలవల్ల మన సంస్కృతి కకావికలు అయింది. అందుకుతోడు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ధర్మంపై కన్న ధనంపై దృష్టి పెరిగింది. భారతీయుడు తన సంస్కృతికి తాను పరాయి వాడు అయ్యే స్థితి వచ్చింది. ఆ గాంధీ, వివేకానంద, అరవింద, రవీంద్రుల వంటి మహనీయుల తరం గడచిపోయింది. వారి సందేశాలు అక్కడే ఉండిపోయాయి. ప్రజలు ఇక్కడే ఉండిపోయారు. ఈ స్థితిలో ఆ మహనీయులందరినీ తనలో ఆవహింపజేసుకున్న మూర్తిత్వం అవసరమైంది. ఆ స్వరములన్నీ తనలో పలికించగల వీణ అవసరమైంది. ఆయా సందేశాలను అనుసంధానం చేసి, సమన్వయాత్మకమైన 'ఆచరణ' పథాన్ని తీర్చిదిద్దే వ్యక్తిత్వం అవసరమైంది. ఆయనే కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య.

[11-8-1988 న మాస్టర్ ఇ. కె. జన్మదిన సందర్భంగా విజయవాడలో ఇచ్చిన ప్రవచన సారాంశం]

# నవ్వుతూ బ్రతకడం నేర్చుకుందాం

శ్రీకృష్ణ తత్వంలో కాస్సేపు జీవించే ప్రయత్నం చేద్దాం.

కృష్ణుడిని ఎవరైనా వృద్ధుడుగా ఊహించగలరా? కురుక్షేత్రం నాటికి వంద సంవత్సరాలు సమీపించినవాడు ఆయన ఏ ఆర్టిస్టయినా ఆ వందేళ్ల రూపాన్ని ఊహించి వేస్తే- మనం దాన్ని ఒప్పుకుంటామా? నీకు బుద్ధి ఉందా? అని అడుగుతాము.

కారణ మేమి? ఏమిటా అనుభూతి?

కృష్ణుడు అనగానే నిత్యనూతనుడైన ఒక యువకుడు, క్రీడాపరుడైన ఒక బాలుడు కనబడుతున్నాడు. అనగా వయస్సుయొక్క ప్రభావం ఆయనపై లేదు. లీలామానుష విగ్రహుడు ఆయన. ఆ నిత్యనూతనత్వంలోని రహస్య మేమి?

కృష్ణుడు అనగానే- కందనివాడు, అలవనివాడు, లీలామానుషంగా పనులన్నీ నడచిపోతున్నవాడు కనబడతాడు. రాముడు అనగానే- దీక్షాపరుడై, వ్రతము పూనిన వ్యక్తి కనబడతాడు. కోదండాన్ని ధరించిన రాముడిని ఊహిస్తాం. వేణువును ధరించిన కృష్ణుడిని మాత్రమే ఊహించగలం.

ఈ అవతారాల మధ్య అనుసంధానం ఉన్నది. ధర్మాచరణలో దీక్ష నేర్పడానికి దిగివచ్చినది రామావతారం. ధర్మాచరణను క్రీడగా నిర్వహించడం ఎలాగో నేర్పడానికి దిగి వచ్చినది కృష్ణావతారం.

యోగః కర్మసు కౌశలమ్- అన్నాడు. ఆ కర్మాచరణలోని రహస్యాన్ని ఉపదేశించడానికి, ఆ "పాయిజ్"లో నిన్ను నిలబెట్టడానికి,

ఆనందమయంగా ఆచరణ కొనసాగే విధానాన్ని వివరించడానికి దిగివచ్చినది కృష్ణావతారం. ధర్మాచరణను క్రీడగా, లీలగా, హేలగా ఎలా నిర్వహించాలో ఆయన మనకు చూపుతాడు.

రాముడు అనగానే- పాపం ఆయనకు ఎన్ని కష్టాలు వచ్చాయి అనిపిస్తుంది. కృష్ణుడు అనగానే అలా అనిపించదు. నిజానికి- మృత్యు దేవత కోరల మధ్య కృష్ణావతారం నడిచింది.

జైలులో పుట్టాడు. పుట్టగానే చెప్పండి నరికేస్తాం- అన్న పరిస్థితిలో పుట్టాడు. తాను పుట్టి, తనను ఎలా రక్షించుకోవాలో తానే చెప్పి, వసుదేవుడిని నడిపించుకు వెళ్ళి, వ్రేపల్లెను చేరుకున్నాడు.

పూతనతో ప్రారంభించి రాక్షసులు వెన్నాడుతూనే ఉన్నారు. అతడు మాత్రం చిరునవ్వుతో వారికి జవాబు చెపుతూ వచ్చాడు.

ఆతడి చిరునవ్వు చెరగలేదు. అతడి వేణుగానం ఆగలేదు. అతడి "పాయిజ్" చెడిపోలేదు.

మానవ జన్మ ఎత్తినందుకు పరాకాష్ఠ ఏమిటో, పరమోన్నత స్థితి ఏమిటో కృష్ణుడు చూపాడు. పరమార్థం ఏమిటో రాముడు చూపాడు.

కృష్ణుడు రాక్షసులను అవలీలగా త్రుంచివేశాడు తప్ప తాను ఎక్కడా దడిసి పోలేదు. దస్సిపోలేదు.

చివరికి-"వాడినే ఇక్కడికి పిలుచుకురా" అని అక్రూరుడిని పంపించాడు కంసుడు. మన స్వామిని ఎత్తుకు వెళ్ళిపోతున్నారే అని గోపికలు విలపించారు. కృష్ణుడు రథం ఎక్కాడు. వెళ్ళి, కంసుడికి ఎలా జవాబు చెప్పాలో అలా జవాబు చెప్పాడు. అతడిని తీసివేశాడు.

ఆ రాజ్యాన్ని ఆయన హస్తగతం చేసుకుంటాడని అనుకున్నారు. ఆయన దానిని ఉగ్రసేనుడికి అప్పగించాడు. మరి ఈయనకు

అధికారం అక్కరలేదా? అధికారంపైననే అధికారం ఉన్నవాడికి అధికారం ఎందుకు? చక్రవర్తులకు రాజ్యాధికారం ఇప్పించాడు తప్ప, తాను రాజ్యాధికారం స్వీకరించలేదు. ఇటు గణరాజ్యాన్ని అన్న బలరాముడికి అప్పగించాడు. తాను మాత్రం- 'నిత్య తృప్తో నిరాశ్రయః' కర్తవ్య నిర్వహణలో నిష్కామం ఉన్న రోజున, అంతకన్న కావలసింది లేదు.

కృష్ణుడి జీవితం నుండి మనం నేర్చుకోవలసింది మరొక్కటి ఉంది.

మనం జీవితం ఒక సమస్య అంటున్నాం. బరువు, భారం అంటున్నాం. బ్రతకలేక బ్రతుకుతున్నాం. చావలేక బ్రతుకుతున్నాం. జీవితాన్ని ఈడుస్తున్నాం. జీవిత మంతా అంధకారం అంటున్నాం.

అలా కాక- చిరునవ్వుతో జీవించడం నేర్పుతున్నాడు కృష్ణుడు. సన్నివేశాలపైన మనం పని చేయాలి తప్ప, సన్నివేశాలు మనపైన పనిచేయకూడదు. సన్నివేశం నిన్ను ఎక్కి త్రొక్కకూడదు. నీవు దానిని "ట్రీట్" చేయాలి. ఆ ఒడుపు తెలుసుకోవాలి. అది కృష్ణుని దగ్గర నేర్చుకోవాలి. ఆయన ఒక్క క్షణం ఖాళీగా లేడు. అయినా ఒక్క క్షణం అలసి పోలేదు. బాధపడ లేదు. తల పట్టుకుని కూర్చోనలేదు.

కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు వంటివారు. ఆ రోజున ప్రపంచంలో ఉన్న ఉద్దండులైన దుష్టులు, ఆయనను హతమార్చాలని చూస్తున్నారు. నిరంతరం వెన్నాడు తున్నారు. వారందరినీ నిర్జించాడు. పలువిధములుగా నా కిది చేతకాదు అనడానికి ఎవరైనా కాంప్లెక్స్ ఫీలవుతారు. కృష్ణుడికి ఆ కాంప్లెక్స్ లేదు. జరాసంధుడు అనేకసార్లు దండెత్తాడు. ప్రజలను తరలించి ద్వారక అనే జలదుర్గంలో వారికి రక్షణ

కల్పించాడు కృష్ణుడు. తన చేతిలో అతడు చావడని కృష్ణునికి తెలుసు. కనుక భీముని సాయంతో అతనిని హతమార్చాడు. అలా ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్కరి సాయం తీసుకుని వాళ్ళ ద్వారా సృష్టి ప్రణాళికను నిర్వహింపజేసినవాడు కృష్ణుడు.

కృష్ణుని దగ్గర "వన్ మాన్ షో" లేదు. ఆయన ఎటువంటి నాయకుడో చూడండి. అర్జునుడు, భీముడు, ధర్మరాజు, భీష్ముడు వంటి ధర్మమూర్తుల మధ్య నాయకుల మధ్య నాయకమణిగా ఆయన మనకు గోచరిస్తాడు.

* * * *

కాలయవనుడు వస్తే కృష్ణుడు పారిపోయాడు. ఆయనకు కర్తవ్యం ఉంది తప్ప- నామర్దా లేదు. ఒక గుహలోకి వెళ్ళిపోయాడు. గుహలో చీకటి. ఈయన అంతకన్న చీకటి. నల్లనివాడు కదా. ఆ కాలయవనుడు గుహలో దూరాడు. అక్కడ ఒక ముని తపస్సు చేసుకుంటున్నాడు. ఆయనను ఒక తన్ను తన్ని- కృష్ణుడు ఏడిరా అని అడిగాడు. ఆ ముని కళ్ళు తెరచే సరికి కాలయవనుడు భస్మమైపోయాడు. ఆ ముని కృష్ణుడిని కీర్తించాడు. ఈయన ఆశీర్వదించాడు. ఆ ముని ముచికుందుడు.

కృష్ణుడి 'ప్రెజెన్స్ ఆఫ్ మైండ్' చూడండి. ఒక క్షణంలో పారిపోయాడు. మరుక్షణంలో అభయముద్ర పట్టాడు. కాలయవనుడి దగ్గర అతనికి కావలసిన కృష్ణుడు ఉన్నాడు. ముచికుందుని దగ్గర అతనికి కావలసిన కృష్ణుడు ఉన్నాడు.

అందుకే- భారతంలో నాయకుడెవరు? అని విమర్శకులు మీమాంస పడుతున్నారు. అలాంటి మీమాంస సృష్టించినవాడు నిజమైన నాయకుడు.

ఆయన వ్రేపల్లెలో గోపికలతో ఆడుకున్నాడు. పాడుకున్నాడు. వేణుగానంతో మరిపించాడు. మైమరపించాడు. ఆ తర్వాత ద్వారకకు వచ్చాడు. ఆ వేణుగానాలు లేవు. అతడేమీ ఊలవలేదు. ద్వారకావాసులు ఆయన రక్షణ కోరారు. ఆ రక్షణ వారికి అందించాడు. హస్తినలో ఉన్న వాళ్ళు శిక్షణ కోరారు. ఆ శిక్షణ వాళ్ళకు అందించాడు. వ్రేపల్లెలోని వారు ఆత్మానుభూతి కోరితే దాన్ని అందించాడు.

భారతంలో కృష్ణుడు ఒక రక్షకుడు. ఒక శిక్షకుడు. భాగవతంలో కృష్ణుడు లీలామానుష విగ్రహుడు. రాసలీలా వినోది. పరాత్పరమైన దివ్య స్థితిని, వైకుంఠాన్ని ఈ భూమిమీదకు దింపి అనుభవింపజేసినవాడు. విభిన్న వ్యక్తిత్వములు ఇవన్నీ వీనిలో దేనికి ఆయన అంటుకోలేదు. అన్నింటినీ ఆయన వ్యక్తం చేశాడు.

ఎలా జీవించాలో ఒడుపు మనకు చూపించాడు ఆయన. అన్నగారికి సురాపానం అలవాటు ఉన్నది ఆయన ఎన్నడూ ఆ ప్రస్తావన తేలేదు. అన్నగారిని గౌరవించడం మానలేదు

సుభద్రా పరిణయానికి ఏమి చేశాడు? అర్జునుడికి సన్యాసి వేషం వేశాడు. స్వాములవారు వచ్చారు చూద్దామా అని బలరాముడిని తీసుకు వెళ్లాడు. అన్నగారికి సన్యాసు లంటే భక్తి ఎక్కువ అని తెలుసు కనుక, ఆ తర్వాత స్వాములవారిని అంతఃపురానికి ఆహ్వానింపజేశాడు. ఆయన సేవకు చెల్లెలిని వినియోగించాడు. ఇద్దరినీ ఒక చోట చేర్చిన తర్వాత- స్వాములవారు ఏమైనారంటే, లేరు అన్నాడు. ఇదంతా నీ ప్రమేయం లేకుండా జరిగిందని నేను అనుకోవాలా అన్నట్లుగా చూచాడు బలరాముడు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు కృష్ణుడు.

అవతలి వ్యక్తిలో ఏ మీట నొక్కాలో కృష్ణుడికి తెలుసు. బలరాముడికి తన మీద ఉన్న వాత్సల్యం తెలుసు. కనుక— అన్నయ్యా, ఈసారికి ఇలా కానివ్వండి. వాళ్ళకు ప్రాప్తి ఉంది, అన్నాడు

ధర్మబద్ధమైన కర్తవ్యం నడిచిపోవాలి. దానికోసం మానవుల మనస్సులను మనం నొప్పించనక్కరలేదు. ఎవరిని ఎక్కడ స్పృశించాలో అక్కడ స్పృశిస్తే చాలు.

కాని– ఇతరులు తనను ఆనందింపజేయాలని అంటాడు మానవుడు. అది సాధ్యపడదు. మనం ఆనందంగా ఉంటే ఇతరులతో ఆనందంగా ఉండగలం కాని, బయటనుంచి ఎవరోవచ్చి ఆనందింప జేయడం అసాధ్యం.

ఆయనను ఎందరో వివాహాలు చేసుకున్నారు. వారిలో ఎవరి కాంప్లెక్స్లు వారివి రుక్మిణీదేవి– నీ పాదాల దగ్గర నాకు చోటుంటే చాలన్నది నీ హృదయంలో నాకు చోటుంటే చాలన్నది. సత్యభామ తర్వాత– నాకే చోటుండా అన్నది. ఆవిడ దగ్గర కూడా ఆయన 'అలాగే' అన్నాడు. ఎవ్వరినీ కాదనలేదు. మధ్యలో నారదుడిని ఉపయోగించుకుని ఎవరికి కావలసిన పాతాల వారికి అందేలా చేశాడు. ఎవరినీ నొప్పించకుండానే.

విభిన్న మనస్తత్వాల మధ్య ఆయన చక్కగా నడచుకున్నాడు. కర్తవ్యాన్ని మాత్రం ఎక్కడికక్కడే నిర్వహించాడు.

మరొక సంగతి. భగవద్గీత అంతా చెప్పాడు కదా. జాతస్య మరణం ధృవం– వంటివి అన్నీ చెప్పాడు కదా. అభిమన్యుడు పోయినపుడు మళ్ళీ అర్జునుడు ఏడ్చాడు. నా 18 అధ్యాయాల భగవద్గీత డిస్కోర్స్ అంతా ఫెయిల్ అయిపోయింది అనలేదు కృష్ణుడు. మానవ మనస్తత్వాల సారాన్ని చూచినవాడు కనుక.

షోడశ మహారాజుల చరిత్ర చెప్పాడు ఈ భూమిమీద పెద్దలు ఎందరో పుట్టారు వాళ్ళ కర్తవ్యాలు నిర్వహించారు. వెళ్ళిపోయారు.

అలాంటివారు మరికొంత కాలం ఉంటే బాగుండును అని మనకు అని పిస్తుంది. ఆ మమకారం సహజమే. కాని- దిగివచ్చేవాడు కర్తవ్యం కోసం దిగివస్తాడుకాని ఉండిపోవడం కోసం కాదు కదా. కర్తవ్యం అయి పోయింది. అభిమన్యుడూ వెళ్లిపోవలసిందే. ఘటోత్కచుడూ వెళ్లిపోవల సిందే రేపు మనమూ వెళ్ళిపోవలసిందే. లేదా వెళ్ళి రావలసిందే.

ఇదంతా చెప్పి- ఆ ప్రక్కన ఉన్నవాళ్ళను అడిగాడు. అభిమన్యు వధ ఎలా జరిగిందని సైంధవుడు అడ్డుపడ్డాడని వారు చెప్పారు. వెంటనే అర్జునుడు ఈ సూర్యాస్తమయం లోపల వాడి తల తరిగేస్తా, అన్నాడు. అతనిలో ఉన్న క్షత్రియ ధర్మాన్ని అలా రెచ్చగొట్టాడు కృష్ణుడు. ఎంత సైకలాజికల్ ఎప్రోచ్ ఉండాలి భూమిమీద జీవిస్తున్నప్పుడు.

అందరికీ ఒక పాఠం చెప్పామనుకోండి- ఇంద్రియాలు, తన్మాత్రలు, మనస్సు మనస్సుయొక్క గుణాలు అంటూ మళ్ళీ కనపడరు వాళ్ళు.

కనుక- ఎవరి భాషలో వారితో మాట్లాడడం నేర్చుకోవాలి మనం. వాళ్ళ మనస్తత్వం స్థాయికి దిగి వాళ్ళను పులకింపజేయాలి. పరవశింప జేయాలి.

కురుక్షేత్రం అయిపోయింది. అయినా ఆయన అలసిపోలేదు. ద్వారకకు వెళుతున్నాడు కర్తవ్యాన్ని నిర్వహించిన తర్వాత. ప్రకృతిని చూచి ఆనందిస్తూ వెళుతున్నాడు.

ద్వారక చేరాడు. ఈ భూమిమీద కనీవినీ ఎరుగనంతటి జననష్టం జరిగిన తర్వాత వస్తున్నాడు. అయినా ఆయనలో విషాద ఛాయలేదు. ఎప్పటివలె శంఖారావం చేశాడు. యాదవులు పరుగు పరుగున వచ్చారు. హారతులు, కీర్తనలు, ఆ తర్వాత వెళ్ళి తల్లులకు నమస్కరించాడు. వారికి

అతడు చంటిపిల్లవాడుగా కనిపించాడు. వారినుండి స్తన్యము ప్రవహించినది.

16,108 మంది భార్యలు. అన్ని గృహాలు, అన్ని రూపాలతో ఒకేసారి వెళ్ళి తలుపుకొట్టాడు. ఎవరితో ఏ మాట చెపితే వారి హృదయం స్పందిస్తుందో ప్రేమస్వరూపుడైన కృష్ణునికి తెలుసు. అలా పలకరించాడు. వారిని పరవశింపజేశాడు.

పనిలో సులువు తెలిస్తే పని చక్కగా జరుగుతూ ఉండగా నీవు ఆనంద స్వరూపుడవై ఉండవచ్చు. ఆనందం పని జరుగుతూ ఉన్నప్పుడు లభించేది. ఆగిపోయినప్పుడు లభించేది కాదు.

* * * *

శ్రీకృష్ణుని జీవితంలోని చరమఘట్టం మనకు ఎంతో ప్రేరణ ఇస్తుంది. మన జీవితగమనానికి దారి చూపుతుంది.

ఆ ఘట్టంలో శ్రీకృష్ణునికి గాంధారి శాపం గుర్తుకు వచ్చింది. నీ వంశం కూడా ఇలాగే నాశనం కావాలి. అని శపించింది ఆమె కృష్ణుడిని. ఇంత సారథ్యం వహించి ధర్మాన్ని రక్షించిన ధర్మ విగ్రహునికి శాపముదక్కడు. ఆయన మాత్రం అలా అనుకోలేదు. 'కాలము నీ నోట పలికినది' అంటూ ఆమెకు నమస్కరించాడు.

ఆ శాపం ప్రకారం ముసలం పుట్టింది. యాదవులు కొట్టుకు చచ్చి పోతున్నారు, వనసమారాధన జరుపుకుందాం ఆనందంగా వెళ్ళిపోదాం. అన్నాడు కృష్ణుడు. సమారాధన జరుగుతోంది జనం కొట్టుకుంటున్నారు. పడిపోతున్నారు. తన చేతిలోకి కూడ ఒక దర్భ వచ్చింది. నవ్వుకున్నాడు కృష్ణుడు.

బలరాముడు అడిగాడు. ఏమిటీ వైపరీత్యం? ధర్మసంస్థాపన అంటే సామూహిక మరణాలేనా?

కృష్ణుడు అన్నాడు- దేహాన్ని స్వీకరించిన మీరు దానికి అంటు కున్నకారణంచేత మీకీ వేదన కలుగుతోంది. పోయినవాళ్ళంతా ఎక్కడికి పోయారు? మళ్ళీ వాళ్ళే లేస్తారు. ప్రస్తుతానికి మనకు విరామం అంతే.

నేను తట్టుకోలేకపోతున్నాను. అంటూ సముద్రంలోకి అలా నడుస్తూ వెళ్లిపోయాడు బలరాముడు. కృష్ణుడు ఒక్కడే మిగిలాడు. "నిత్యతృప్తో నిరాశ్రయః"

వేణువు గుర్తు వచ్చింది. ద్వారకలో కాని, హస్తినలో కాని ఎవరూ వేణునాదం కోరలేదు. ఇప్పుడు ప్రశాంతంగా వుంది. రాతిపై పడుకుని కాలుపై కాలు వేసుకొని బొటనవ్రేలు ఆడిస్తూ వేణువు వాయిస్తున్నాడు. దేశ కాలాలు తెలియడంలేదు. అనంతమైన వేణుగానం అది.

దూరం నుండి ఎవరో వస్తున్నారు. ప్రాణసఖుడు ఉద్ధవుడు. ఆత్మీయత పంచుకున్న మైత్రేయుడు.

బాగున్నారా? అని అడిగాడు కృష్ణుడు.

బాధ్యతపడి పనిచేయడ మంటే ఏమిటో కృష్ణుని దగ్గరే మనం నేర్చుకోవాలి. ధర్మరక్షణ కోసం శారీరిక శ్రమ కూడా చేస్తాను రథం తోలుతాను. గుర్రాన్ని తోముతాను అని చేసి చూపాడు ఆయన. అలా సారథ్యం వహించేవాడు గురువు. కేవలం ఆశీర్వదించి పంపడం బాధ్యతా రహితత్వం అవుతుంది తప్ప ఆధ్యాత్మికత కాదు.

బాధ్యతలను ధర్మబద్ధంగా నిర్వహించినప్పుడు అనుభవానికి వచ్చేదే పరలోకం కనుక- అలా నడవడానికి నా చేయి. నీతో కలుపుతాను. నిన్ను నిలుపుతాను. అవతలివాడు బాణం వేస్తే, కత్తి విసరితే-ముందు నా తల ఉంటుంది. నా వెనుక నీవు ఉంటావు - బాధ్యత పడడమంటే అర్థం,

ఇది అటువంటి రక్షణ నానుండి లభిస్తుంది అని వాగ్దానం చేసినవాడు నాయకుడు. గురువు.

శ్రీకృష్ణుడు అలా జీవితాలను నడిపించాడు. కలిసి నడిపించాడు. అటువంటి జీవితం కనపడితే అది కృష్ణుని అంశ అని గుర్తించాలి.

శ్రీకృష్ణుడు మైత్రేయుడితో అన్నాడు. కలియుగం ప్రవేశించింది. నీ హృదయాన్ని నా సింహాసనంగా స్వీకరిస్తాను. నీ హృదయం నుండి కలియుగాంతం వరకు ధర్మరక్షణ కార్యక్రమాన్ని అమలుపరుస్తాను.

ఈ ఘట్టం యొక్క వివరణ థియాసఫీ గ్రంథాలలో విస్తృతంగా ఉన్నది.

ఆయన అవతారం చాలిస్తున్నందుకు బాధపడాలో, తన హృదయంలో ప్రవేశిస్తున్నందుకు సంతోషించాలో మైత్రేయునికి అర్థం కాలేదు. సర్వ ధర్మాన్ పరిత్యజ్య...నమస్కారం చేశాడు.

ఉద్ధవుడు అన్నాడు– స్వామీ, మీ మూర్తిని నేను మరువలేక పోతున్నాను. మీ వయస్సు నాకు కనపడడంలేదు. కాలపురుషుడు మీపై ప్రభావము చూపలేకపోయాడు. నిత్యయవ్వనం మీది. నిత్య నూతనత్వం మీది.

కృష్ణుడు అతడిని తన వక్షఃస్థలం మీదకు తీసుకుని 'విను'. అన్నాడు. ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసల రూపంలో శాశ్వత పురుషుడనై నేనున్నాను. ఉచ్ఛ్వాస నిశ్వాసలనే రెక్కలుగా కలిగిన గరుత్మంతుడిని అధిరోహణం చేసి నిరంతరం ఈ లోకంలో వెలుగొందుతూనే ఉన్నాను.

అప్పటికే కృష్ణుడు అర్జునునికి కబురు చేశాడు. దాటించవలసిన వారిని అవతలకు దాటించడానికి ఏర్పాట్లు చేశాడు.

మళ్లీ వేణుగానం ప్రారంభించాడు. ఆ ఆడుతున్న బొటనవ్రేలును నెమలి తలగా భావించి ఒక వేటగాడు బాణం వేస్తాడు. దగ్గరకు వచ్చి, ఆ దివ్యసుందర విగ్రహాన్ని చూచి ఏడుస్తాడు. దారుణం జరిగిపోయింది. అన్నాడు. దారుణం కాదు, నీ ఋణం తీర్చుకున్నాను అన్నాడు కృష్ణుడు. అవతారాలకూ లెక్కలు ఉంటాయి. "ఒకప్పుడు నీవు వాలిగా ఉన్నప్పుడు నిన్ను కొట్టాను. ఇప్పుడు నీ చేతల్లో నేను వాలిపోయాను"— అన్నాడు కృష్ణుడు.

ఇలా సందేశాన్ని ఇవ్వడం కోసం పరమార్థాన్ని బోధించడం కోసం మృత్యువును కూడా వినియోగించుకున్న దివ్య అవతారుడు ఆయన. ఆ మృత్యువులో కూడ ఒక ప్రయోజనం ఉన్నది. ఒక సాంత్వనం ఉన్నది. ఒక జవాబు ఉన్నది. వ్యర్థమైన సన్నివేశం ఏదీ లేదు.

మన ముఖాల్లో నీరసం, విషాదం, టెన్షన్, ఒత్తిడి కనపడకూడదు. బాధలు, బరువులూ, నిస్పృహలూ, నిట్టూర్పులూ కనపడకూడదు.

మృత్యువు కోరల మధ్య, ఆదినుండి అంతం వరకు చిరునవ్వుతో, వేణుగానంతో సాగిపోయిన ఒక దివ్యవిగ్రహుడు పుట్టిన నేల ఇది. ఆయన సారథ్యంలో నడుస్తున్న భూమి ఇది ఇక్కడ నిట్టూర్పులకూ, అశ్రువులకూ చోటులేదు. అంత లీలగా మన కర్తవ్యాన్ని మనం నిర్వహింతుముగాక-ఆనందంగా, క్రీడగా, జీవితమనే పాటగా, ఒక వేణుగానంగా.

ఈ దేహమే నీ మురళి. ఈ జీవితమే నీ గానసరళి-అనేటట్లు జీవించి సార్థకతను పొందుదాం.

(3-9-88న శ్రీ కృష్ణజన్మాష్టమి సందర్భంగా విజయవాడలోని శిశు విద్యామందిరంలో ఇచ్చిన ప్రవచన సారాంశం).

# ఇందరు దేవతలు ఎందుకో తెలుసా

ఆర్ద్రంగా, ఆనందంగా కథలు చెప్పారు మన పూర్వీకవులు. మహర్షుల తపస్సుకు సైతం అందని అద్భుత సత్యాలను కథల రూపంలో అందించారు.

శమంతకమణి కథ అందరికీ తెలిసినదే. సత్రాజిత్తు సూర్యుని గురించి ఎన్నో సంవత్సరాలు తపస్సు చేయగా లభించిన మణి అది. అది బంగారాన్ని వర్షిస్తుంది. దానిని చూచిన శ్రీకృష్ణుడు ఆ మణిని ప్రభుత్వానికి ఇవ్వడం మంచిదని సలహా ఇస్తాడు. నేను కష్టపడి సంపాదించుకున్నది ప్రభుత్వానికి ఇవ్వడానికేనా, ఈ మణి మీద నీ కన్ను పడిందా-అన్నట్లు చూశాడు సత్రాజిత్తు.

మన దేశంలో ఈ బలహీనత ఉన్నది. సిద్ధులు, తపస్సంపన్నులు వ్యక్తిగత మోక్షం మీద శ్రద్ధ చూపుతారు. సామాజిక శ్రేయస్సు సంగతి పట్టదు.

ఆ మణి కథలో మరో విశేషం ఉంది. చివరికి శ్రీకృష్ణుడు జాంబవంతుడిని జయించి దానిని తెచ్చి ఇస్తాడు. రామావతార కాలంలో ఈ జాంబవంతునికి ఒక కోరిక కలిగింది. తాను రాముని పక్షంలో ఉండిపోయాడు. ఆయనతో ఒక పట్టు పట్టే అవకాశంవస్తే బాగుండునని అనుకున్నాడు. కృష్ణావతారంలో ఆ అవకాశం లభించింది. అతనికి కృష్ణునిలో రాముడు కనిపించాడు. మణిని, బాలామణిని [జాంబవతిని] ఆయనకు మర్పించాడు.

కాగా-రాముడు, కృష్ణుడు, మరెందరో దేవతలు ఉన్నారు. ఏ దేవుడిని పూజించాలి? ఎవరి పార్టీలో చేరాలి? వీరు కాక గ్రామదేవతలు ఉన్నారు. చెట్టుకు, పుట్టకు మొక్కుతున్నారు. అసలు ఇందరు దేవతలు ఏమిటి? ఇదంతా కన్‌ఫ్యూజన్‌గా ఉంది. అనే వారూ ఉన్నారు.

నిజానికి దేవుడు ఒక్కడే. దేవతలు ఎందరో. దేవతలు దేవుని మూర్తులు. సృష్టి కార్యక్రమం దిగివస్తున్నప్పుడు దేవుడు ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క రూపం ధరించాడు. కర్తవ్య నిర్వహణను బట్టి దేవునికి ఆయా పేరులు, రూపాలు వచ్చాయి. ఉన్నది ఒక్కడే. సృష్టిస్తున్నప్పుడు అతడు బ్రహ్మ, పోషిస్తున్నప్పుడు విష్ణువు, లయం చేస్తున్నప్పుడు శివుడు. గణాలకు ఆధిపత్యం వహిస్తున్నప్పుడు గణపతి. ఉత్సాహమూర్తిగా ఉన్నప్పుడు కుమారస్వామి.

మనకూ, మన శరీర భాగాలకూ ఎలాంటి సంబంధం ఉన్నదో దేవునికీ దేవతలకూ అలాంటి సంబంధం ఉన్నది.

ఒక నర్తకి నృత్యం చేస్తున్నది. ఎన్నో భంగిమలు ప్రదర్శిస్తున్నది. ఆ భంగిమలు ఫొటో తీశారు. ఇరవై ఫొటోలు ఉన్నాయి. భంగిమలు ఇన్ని ఉన్నప్పటికీ నర్తకి ఒక్కతే.

ఇక గణపతి విషయానికి వస్తే - సరస్వతీ గణపతిగా, లక్ష్మీ గణపతిగా, పార్వతీ తనయుడుగా, విఘ్నాధిపతిగా అతడు మనకు కనిపిస్తాడు.

అక్షరాభ్యాసం చేయించేటప్పుడు సరస్వతి ప్రక్కన గణపతిని ఉంచుతారు. ఆమె వాక్కుగా ప్రవహిస్తూన్న దేవత. ఆ వాక్కుకు కావలసిన దేవతాగణములకు అధిపతి గణపతి. ఎక్కడో మూలాధారంనుండి వాక్కు బయలుదేరుతున్నది. ఆ ఒంటి స్తంభపు మేడలో ఎన్నో సంకల్

ములు వ్యక్తమవుతూ ఉంటాయి. ఆ సంకల్పములకు రూపం ఇవ్వడానికి వాక్ గణములు గుంపులు గుంపులుగా పనిచేస్తాయి. ఆ గణములకు అధిపతి గణపతి. అనగా స్టెనోలుగా, టైపిస్టులుగా పని చేసే దేవతా గణములకు అధిపతి.

అలాగే, భారతాన్ని వినాయకుడు వ్రాశాడు. నా భావం, నా దర్శనం భాష రూపంలో వెలువడడం ఎలా అని ఆలోచిస్తున్నాడు వేద వ్యాస మహర్షి. నా దంతంతో వ్రాసి పెడతా నీ వేదాంతమంతా-అన్నాడు గణపతి.

మరి లక్ష్మీగణపతి అర్థం ఏమిటి? లక్ష్మి అంటే చిహ్నము, మూర్తి కల్పనము. చీమకు చీమ రూపం ఎలా వస్తున్నది? ఆ 'మోల్ట్స్', ఆ మూసలు ఎలా తయారవుతున్నాయి? ఆ మూసలను, ఆయా రూపములను తయారుచేసే దేవతా గణములకు అధిపతి గణపతి. అలా సృష్టి మొత్తాన్ని మూసలో నుంచి తీస్తున్నాడు గణపతి.

పార్వతీ తనయుడు అంటే అర్థం ఏమిటి? ప్రళయం అంటే ప్రమాదం కాదు, ప్రకృష్టమైన లయం. తర్వాత జరిగే సృష్టికి ఆయా జ్ఞాపకాలు, కొలతలు మిగిలిఉండేటట్లు సృష్టిని లయం చేస్తున్నాడు శివుడు. సృష్టి లయమైనప్పుడు దాని వెనుక కనపడకుండా ఉన్న దేవతా గణములకు అధిపతి గణపతి. అనగా సృష్టి నిర్వాహకుడు. కనుకనే విఘ్నేశ్వరుడు. మొట్టమొదట ఆయనకు నమస్కరిస్తాం-నీవు సృష్టి కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నట్లు లోక కార్యక్రమాన్ని మేము నియమం తప్పకుండా నిర్వహింతుము గాక అనే భావనతో లోక కార్యక్రమంలోని అనుపానుల దర్శనం ఇవ్వవలసిందిగా కోరుతూ ఆ అనుపానులు తెలియకపోతే, ఆ పద్ధతి తెలియకపోతే విఘ్నం వస్తుంది కనుక.

ఆయా దేవతల పూజలు స్వయంగా చేయడం నేర్చుకొందుముగాక అని ఈ సందర్భంగా ఆకాంక్షిస్తున్నాను.

అలాగే వేదాధ్యయనానికి, మనసంస్కృతిని అభ్యాసం చేయడానికి, దానియందు జీవించడానికి, దాని దర్శనం పొందడానికి జీవితంలో కొంత భాగాన్ని కేటాయించడం మనకు కర్తవ్యం అవుతున్నది. లేకపోతే మన జీవితం ఒక చీకటి గది అయిపోతుంది. ఇల్లు అనే చీకటి నూతిలోనికి మనం వెళ్ళిపోతాం. మన సంప్రదాయంలో జీవించడానికి, సంప్రదాయాన్ని దర్శించడానికి మనం రోజూ ఒకగంట కేటాయించలేమా ? అలా కేటాయించకపోతే మనకు పుట్టగతు లుంటాయా? గణాధిపతి వేస్తున్న ప్రశ్న ఇది. ఇస్తున్న సందేశం ఇది.

[ 15-9-88 న వినాయక చవితి సందర్భంగా విజయవాడలోవి సీతారామ కళ్యాణమండపంలో చేసిన ప్రవచన సారాంశం ]

# ఆమె ఒక అమృతమూర్తి

పరమ గురువుల దర్శనాన్ని పొంది, సర్వమత సమన్వయాన్ని దర్శించి, మానవజాతికి అందించిన సాహసికురాలు బ్లావెట్‌స్కీ.

అలాగే తాత్వికునికీ, శాస్త్రవేత్తకూ మధ్య సమన్వయాన్ని ఆమె దర్శించింది. ఆ ప్రక్రియలు రెండూ ఒకే నాణానికి బొమ్మా-బొరుసూ. మన ముందున్నది ఒకే ప్రకృతి. ఆమెను ఆరాధించినప్పుడు శాస్త్రవేత్తలం.

ఆరాధిస్తూ పరిశోధించినవాడు ఋషి. ఫిలాసాఫికల్ టచ్ ఉన్న సైన్స్ ఆయనది. పురుష సూక్తం చూడండి. శ్రీసూక్తం చూడండి. వానిలో అనుభూతి ప్రదమైన శాస్త్రాన్ని అందించారు మన ఋషులు.

ఆధ్యాత్మికవేత్తగా ఆరాధన, శాస్త్రవేత్తగా అవగాహన-రెండూ కలిస్తే ఐన్‌స్టీన్ వంటివారు జన్మిస్తారు. అవగాహన పొందాలంటే ఆరాధన అవసరం.

ఆత్మీయుడైన వ్యక్తి తనలో దాచుకున్న అనుభూతులను మనకు అప్రయత్నంగా వినిపిస్తాడు. అలాగే, భగవంతుని ప్రేమించినవారికీ, ఆయనతో శ్రుతి కలిపినవారికి ప్రకృతిలోపల ఉన్న శాస్త్రసత్యాలు దర్శనమిస్తాయి.

ఆ విధమైన సింథెటిక్ అప్రోచ్‌తో ఆధునిక యుగంలో బ్లావెట్‌స్కీ ఆధ్యాత్మిక దర్శనాలలోని మూల సిద్ధాంతాలను మానవజాతికి అందించింది.

రష్యాలో పుట్టిన బ్లావెట్‌స్కీ భారత భూమిపై అడుగుపెట్టినప్పుడు "ఋషులు నడచిన పుణ్యభూమి ఇది" అని నేలపై అలా పొర్లిపోయింది. పరవశించిపోయింది. నా జన్మ ధన్యమైనదని, ఆమె పగలు దేశంలో పర్యటిస్తూ, రాత్రి హిమాలయ గుహలలో పరమగురువులవద్ద శిక్షణ పొందుతూ కాలం గడిపింది. ఆ తర్వాత దివ్యజ్ఞాన సమాజం ఆవిర్భవించింది.

ఈ రోజున మనం సెక్యులరిజం గురించి వింటున్నాం. సెక్యులరిజం అంటే ప్రార్థనలూ, పూజలూ మానుకోవడంకాదు. మతాలమధ్య ఏకసూత్రతను దర్శించడం. సర్వసిద్ధాంత సమన్వయాన్ని దర్శించడం. ఆ సెక్యులరిజం, ఆ అనుభూతి, ఆ దర్శనం దివ్యజ్ఞాన వాఙ్మయం ఉన్నాయి. అది సనాతన ధర్మం దగ్గరకు మనలను తీసుకువెళుతుంది.

ఆ బ్లావెట్‌స్కీ వ్రాసిన 'సీక్రెట్ డాక్ట్రిన్' గ్రంథాన్ని ఒక జర్నలిస్టుగా చదువుకుంటూ అనుభూతి చెందుతూ, ఆమెకు దగ్గరైంది అనీబీసెంట్. జిజ్ఞాసాపరురాలుగా వెళ్ళి ప్రేరణ పొంది, ఆమెకు వారసురాలైంది. ఆమె కృషిని కొనసాగించగలిగే "స్టేచర్" గల వ్యక్తిగా ఒక అమృతమూర్తిగా అనీబిసెంట్ మనకు దర్శనమిస్తుంది.

ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు తమ చిన్న తనంలో ఆమె ఉపన్యాసం విన్నారు. సరస్వతి మూర్తీభవిస్తే ఇలా ఉంటుందని నా కనిపించింది. ఆ ముద్రను నేను, మరచిపోలేను. అన్నారాయన తమ అనుభూతిని వర్ణిస్తూ. ప్రజలు ఉర్రూతలూగుతూ, పారవశ్యం చెందుతూ వినేవారు ఆమె ఉపన్యాసాలను.

ఒకసారి ఆమె ఉపన్యాసం ఆలస్యంగా ప్రారంభమైంది. సూక్ష్మ దేహాలతో ఉన్న పరమ గురువులు అందుకు కారణం అడిగారు ఆమెను. పెద్దలు, ప్రజలు సమకూడడానికి సమయం పట్టింది అని ఆమె సమాధానం చెప్పింది. "నీ ఉపన్యాసంకోసం సూక్ష్మ దేహాలతో ఎంతమంది వేచి

ఉన్నారో చూడు" అన్నారు పరమ గురువులు. ఎన్నడూ సమయం తప్ప వద్దని అన్నారు. ఇక ఎన్నడూ ఇలా జరగనివ్వను అన్నదామె సిగ్గుతో. ఇహలోక పరలోకముల ఆనుపానులు తెలిసి జీవించిన వ్యక్తి ఆమె.

ఒకసారి ఆమెను ఓ ప్రశ్న అడిగారు. శరీరాలు ధరించిన జీవులకూ, శరీరాలు విడిచిపెట్టిన జీవులకూ నిష్పత్తి ఎలా ఉంటుందని ఈ నగరంలోని సినిమాహాళ్ళ లోపల ఎందరున్నారు? హాళ్ళ బయట నగరంలో ఎందరున్నారు? ఆ నిష్పత్తి ఉంటుందని ఆమె సమాధానం చెప్పారు.

అనగా ఎందరో జీవులు ఈ దేహం లభించడంకోసం వేచి ఉన్నారు. ఇద్దరు లేక ముగ్గురు అనే ఈ రోజుల్లో, ఈ ఎర్ర త్రికోణపు రోజుల్లో దేహం లభించడం ఎంత కష్టం! కనుక ఈ శరీరాన్ని సద్వినియోగం చేసుకోవాలి. అప్పుడు భూదేవి సంతోషిస్తుంది.

ఆమె లోకజ్ఞతతో చెప్పిన సమాధానం ఇది. మరో లోతైన ప్రశ్న అడిగారు. ఏసుక్రీస్తు, బుద్ధుడు అవతారమూర్తులని అంటారు కదా. ఏసుక్రీస్తు చనిపోయిన వ్యక్తిని బ్రతికించాడు. తన బిడ్డ చనిపోయాడని చెప్పిన తల్లికి బుద్ధుడు ఎవరూ చనిపోని ఇంటినుంచి ఓ ఆవగింజ పట్టుకురా అన్నాడు. ఆమె తిరిగివచ్చి ఆయన పాదాలకు నమస్కరించి "నాకు బోధపడింది ప్రభూ" అన్నది. ఈ బోధల తారతమ్యమేమి? పారమ్యమేమి? బుద్ధుడు ఆ బిడ్డను బ్రతికించలేడా?

అనీబిసెంట్ సమాధానం చెప్పింది - అక్కడ మానవ జాతులు శైశవ దశలో ఉన్నాయి. తనకు ఎన్ని బాధ్యతలు ఉన్నా పిల్లవాడిని తృప్తి పరచడానికి తండ్రి ప్రయత్నిస్తాడు. పెద్దవాడు అడిగితే— పరిస్థితి నీకూ తెలుసుకదా. అర్థం చేసుకు నడుచుకో అంటాడు. భారత జాతి అలా ఎదిగిన జాతి. జాతస్య మరణం ధృవం అన్న సత్యం ఆ తల్లికి బోధపడింది. అది కాలధర్మం అని ఆమె గుర్తించింది.

కనుక అవతార మూర్తులలో ఆ తారతమ్యం లేదు. వాళ్ళ చుట్టూ ఉన్న జాతుల వ్యక్తిత్వాలలో తారతమ్యం ఉన్నది అని అనీబిసెంట్ చెప్పగా, ఆ అడిగిన వ్యక్తి ముగ్ధుడైపోయాడు.

ఆ సంభాషణలు ఈ భూమిమీద రికార్డయి ఉన్నాయి. మహనీయుల జీవితాలను ప్రకృతి రికార్డు చేస్తుంది. మళ్ళీ ఆ స్థాయి కలిగిన వ్యక్తులు భూమికి దిగివచ్చినప్పుడు ఆ సన్నివేశాలన్నీ వారికి ప్రసారం అవుతాయి. భవిష్యత్తులో అడ్వాన్స్‌డ్ టి.వి లు వస్తాయి. 13వ శతాబ్దికి 12వ శతాబ్దికి ట్యూన్ చేస్తే ఆ డయలాగ్‌లు వినగలుగుతాము. కృష్ణదేవరాయల భువన విజయాన్ని మీరు వినవచ్చు.

కాగా బ్లావెట్‌స్కీ ప్రౌఢంగా, గహనంగా చెప్పిన సమన్వయాన్ని అనీబిసెంట్ లలిత మధురంగా అందించింది. ఆ దర్శనానికి ఆమెడ భాష్యం చెప్పింది.

అనీబిసెంట్ జిడ్డు కృష్ణమూర్తిని మాతృమూర్తిగా పెంచి పెద్ద చేసింది. అనీబిసెంట్‌లోని ఆర్ద్రత ఆయనలో రూపు ధరించింది. క్రతు కాండల పేరిట, గురుశిష్య సంప్రదాయం పేరిట కపుడు కట్టిపోవద్దు. ఆధార పడే స్థితికి దిగజారవద్దు. ఆ దారినపోయే స్థితికి మీరు ఎదగాలి. డివోషన్ అంటే డిపెండెన్స్ కాదు. మనిషికి మనిషి దగ్గర కావాలి. మమకారంనుంచి ప్రేమలోనికి మేలుకొనాలి, ఇదీ ఆయన సందేశం.

ఆయన అంటారు-భర్త పోయినప్పుడు భార్య ఏడుస్తున్నది. ఆయన దూరమైనందుకు బాధకన్న నన్నొంటరిని చేసిపోయావు అనే బాధ ఎక్కువ కన పడుతుంది ఆ ఏడుపులో. మనిషి దూరమైతే ఆర్ద్రంగా వీడ్కోలు చెప్పడం మానవుడు నేర్చుకోవాలి.

బ్లావెట్‌స్కీ, అనీబిసెంట్ స్త్రీ మూర్తులు. సర్వ సిద్ధాంత సమన్వయాన్ని అందించిన మూర్తులు. కానీ సనాతన ధర్మానికి విరుద్ధంగా కాంతా కనకములు ఆధ్యాత్మిక సాధనకు అవరోధములు అనే మాట వచ్చింది. అనీబిసెంట్‌లో, అరవింద మదర్‌లో సంప్రదాయనిష్ఠ ఉన్నది. ఉపాసన ఉన్నది. సనాతన ధర్మానికి వీరు భాష్యం చెప్పారు. ఇలాంటి వ్యక్తులు ఈ గడ్డపైన తయారవకుండా మనం అడ్డుపడ్డామేమో కాంతా కనకాల పేరిట.

నిజానికి స్త్రీల వల్ల మాత్రమే భారత ధర్మం జీవిస్తున్నది. వంటింటిలో శరణు పొందుతున్నాడు దేవుడు ఈ దేశంలో.

పరమ గురువులు చెప్పారు. ఆధ్యాత్మిక సాధనకు ఆడజన్మ అత్యవసరమని. మగవాడు మనస్సుతో ఆలోచిస్తాడు. స్త్రీ హృదయంతో స్పందిస్తుంది. పది మగ జన్మలలో సాధించలేనిది ఒక్క స్త్రీ జన్మలో సాధించవచ్చునని వాళ్ళు చెప్పారు.

కానీ మనం ఆడపిల్ల పుడితే ఎప్పుడు వదిలించుకుందామా అనుకుంటున్నాం. ఎంత అపచారం!

స్త్రీల చేత ఉద్యోగాలు చేయిస్తున్నాం. నా సవరణ హృదయం స్పందించే వృత్తులలో మాత్రమే స్త్రీలను ప్రవేశపెట్టండి. మాతృత్వం వెల్లివిరిసే ఉద్యోగాలను వారికి అప్పగించండి. చేతులెత్తి దండం పెట్టే చోట మాత్రమే స్త్రీ మూర్తులను నిలబెట్టాలి. తత్వవేత్తల స్థాయికి ఎదిగేందుకు ప్రోత్సాహం ఇస్తే వారి శక్తుయుక్తులను ఆరాధిస్తే-మన స్త్రీమూర్తులు వెలుగు కిరణాలై వర్ధిల్లరా?

[25-9-88న ఏలూరు 'దివ్యజ్ఞాన కేంద్రంలో అనీబిసెంటు వారోత్సవాల సందర్భంగా ఇచ్చిన ప్రవచన సారాంశం]

# మన మందిరం వలంటీర్లం

బయట బ్యానర్ మీద 'మెర్రీలైఫ్ డే' అనే మాటలు కనబడ్డాయి. కాని మన చుట్టూ 'వర్రీ లైఫ్' మాత్రమే కనబడుతోంది. ఎటు చూసినా టెన్షన్, ఒత్తిడి. ఆందోళన నిండిన దుర్భరమైన జీవితం కనిపిస్తోంది. ఈ స్థితిలో ఆ మహా ప్రాణం ఏ విధంగా దిగి మనల్ని తరింపజేస్తుంది?

మనం జీవితాన్ని గడపడంకాక నడపడం నేర్చుకున్నపుడు, ఆందోళనతో కాని జీవితాన్ని ఒక ఆటగా క్రీడగా తీసుకున్నప్పుడు, శరీరంలో ఉండడం నేర్చుకన్నప్పుడు అది జరుగుతుంది.

ఇప్పుడు శరీరం మనల్ని ఉపయోగించుకుంటోంది, మనకు శరీరం ఉపయోగపడే దెప్పుడు?

శరీరానికి మనం ఆహారం, పానీయం, వినోదం-అన్నీ ఇస్తున్నాం. ఆ శరీరం మనకు వినియోగపడితే మెర్రీలైఫ్, శరీరానికి మనం వినియోగ పడితే వర్రీలైఫ్.

ఇవన్నీ చూసుకోకపోతే జీవితం ఎలా సాగుతుంది? అని మీరు అడగవచ్చు. అదే జీవితం అయితే, ఆ జీవితం ఎందుకు? అని నేను అడుగుతున్నాను.

నీవు శరీరాన్ని వినియోగించుకోవడం ప్రారంభిస్తే, శరీరానికి కావలసినవన్నీ అప్రయత్నంగా దాని దగ్గరకు అవే వస్తాయి. తదర్థం కర్మ "కౌంతేయ ముక్త సంగ స్సమాచర-" అంటున్నది భగవద్గీత.

ఎప్పుడైతే ఈ సృష్టికోసం, మన కర్తవ్యం కోసం ఈ శరీరాన్ని సద్వినియోగం చేస్తామో-అపుడు అన్నం, నీరు, గూడు గురించి మనం ఆలోచించవలసిన పనిలేదు.

ఎప్పుడైతే మహా ప్రాణం, పరమ గురువుల అనుగ్రహం మనకు సోకుతుందో, వారి కటాక్ష వీక్షణం మనపైన పడుతుందో- ఈ జీవితం యెడ ఉన్న భీతి తొలగిపోతుంది. అంతకన్న మోక్షమంటూ ఏమీ లేదు. భవిష్యత్తు అంటే భయం తొలగిపోవడమే మోక్షం.

మరి- శరీరాన్ని సద్వినియోగం చేయడం అంటే ఏమిటి? ఇంత వరకు నీవు చేస్తున్న పని నీ కొరకు లోకం కొరకు పనిచేయడమే. శరీరాన్ని సద్వినియోగ పరచడం,"తదర్థం కర్మ కౌంతేయా"పనిని లోకానికి సేవగా చేయడానికి, వాలంటీర్‌గా పని చేయడానికి ఈ భూమి మీదకు నేను దిగి వచ్చాను-అనుకుంటూ పని చేయడం.

డబ్బు సంపాదించడం కోసం డాక్టర్ వృత్తిని చేపట్టిన డాక్టరు ప్రజలకు సేవ చేయడం కోసం వాలంటీర్‌గా ఈ భూమి మీదకు దిగి వచ్చాను అని గ్రహిస్తే, ఆ పని మనకొరకు కాదు, అందరిలో ఉన్న అతని కొరకు అని ఆచరించినట్లయితే వర్రీ పోయి మెర్రీ వస్తుంది. అనుక్షణం ఆ మహా ప్రాణంతో మనకు కనెక్షన్ మెయిన్‌టెయిన్ అవుతుంది.

ఎందువల్ల ?

ఇంటికి ఇచ్చే కరెంటుకూ, ఫ్యాక్టరీకి ఇచ్చే కరెంటుకూ తేడా ఉంటుంది. ఫ్యాక్టరీకి ఇచ్చే కరెంటుకు వోల్టేజి ఎక్కువ ఉంటుంది. అలాగే- తన కొరకు జీవించేవాడికి పరిమితమైన దైవశక్తి మాత్రమే అందుతుంది. ఇతరుల కోసమే ఈ జీవితం అనుకునేవాడికి మహా ప్రాణంతో సంధానం కుదురుతుంది. అనుక్షణం ఆ మహాప్రాణంతో, ప్లెంటీ ఆఫ్ ప్రాణతో

జీవించడం మానవ జన్మకు ఇవ్వబడిన ఒక దివ్యమైన అవకాశం. జన్మ కర్మచమే దివ్యం. అన్నమాటకు అర్థం ఇది.

కరెంటు ప్రవహించడం, ప్రాణశక్తి ప్రవహించడం ఇతనిపై ఆధారపడి ఉండదు. కార్యక్రమానికి ఎంత అవసరమో అంత ప్రవహిస్తుంది. ఆ విధంగా ఎప్పటికప్పుడు పంచిపెట్టబడుతూ ఉంటుంది. ఆ స్థితిని అనుభవించటం కోసం మీడియంగా ఈ శరీరాన్ని మనం తెచ్చుకున్నాం. ఆ ప్రాణశక్తిని అందుకొని ఒక కార్యరూపంగా ఇతరులకు అందించే మీడియంలము మనం.

ఆకాశంలో ఉన్న ధ్వని తరంగాలను అందుకుని మనకు వినిపించే మీడియంగా ఒక రేడియో పెట్టె ఉన్నది. ఆ తరంగాలను అందుకుని బొమ్మగా చూపించే టి. వి. ఉన్నది. అలాగే, మహాప్రాణమనే దివ్యశక్తిని కార్యరూపంగా ఇతరులకు ట్రాన్స్‌మిట్ చేసే ఒక సాధనంగా ఈ మానవ శరీరం ఉన్నది. అది ఒక పరికరం. అవతల దైవశక్తి ఉన్నది. ఇవతల లోకం ఉన్నది. ఆ దైవశక్తిని కార్యరూపాన్ని ధరించి ప్రసరించేందుకు మీడియంగా శరీరం ఉన్నది. అలాంటి మీడియంగా మానవుడికి అతని శరీరాన్ని అప్పజెప్పడమే మాస్టర్ సి.వి.వి.గారు పెట్టుకొన్న ధ్యేయం. అపుడు శరీరం, మనస్సు, జీవితం– అన్నింటిలో దివ్యత్వం దిగివస్తుంది. మనిషికి జీవన్ముక్తి స్థితి లభిస్తుంది.

ఆ దివ్యత్వాన్ని ఆ దివ్యానుభూతిని అనుభవించడం కోసం దేహధారులమై మనం ఈ లోకంలోనికి వచ్చాం.

[మైత్రీ లైఫ్ డే సందర్భంగా మంగళగిరిలో ఇచ్చిన ప్రవచన సారాంశం]

# ఇదీ సామాజిక స్పృహ

మన రామాయణ, భారతాలు, పురాణాలు, ఎవరికి బోధపడతాయి? సమాజ శ్రేయస్సు యెడ దృష్టి ఉన్నవారి దగ్గరకు, లోకహిత నిష్ఠ ఉన్న వారి దగ్గరకు అవి నడచివస్తాయి. దానికి నిదర్శనం భాగవత ఆవిర్భావం.

అష్టాదశ పురాణాలు, మహాభారతం వ్రాసిన తర్వాత కూడ వేద వ్యాసునికి తృప్తి కలుగలేదు. ఇన్ని చెప్పినా ప్రజలకు ధర్మంయెడ ఉన్ముఖత్వం కలగడంలేదు. అది ప్రజల తప్పా? చెప్పడం నాకు చేత కావడం లేదా?—అని ప్రశ్నించుకున్నాడాయన.

బాధ్యతాయుతుడైన ఋషి కనుక—'ప్రజలకు ఉన్ముఖత కలిగే టట్లు చెప్పడానికి నేనింకా సాధన చేయవలసి ఉన్నది' అని సమాధానం చెప్పుకున్నాడు. చింతాక్రాంతుడై, సరస్వతీ నది ఒడ్డున కూర్చున్నాడు.

పరిస్థితి ఇప్పుడే ఇలా ఉంటే, రాబోయే కలియుగంలో ప్రజలు "అలసులు, మందబుద్ధులు, అల్పతరాయువులు, ఉగ్రరోగ సంకలితులు" అయినప్పుడు మరెంత దారుణంగా ఉంటుందో అని ఆయన బాధపడ్డాడు.

ఆయన తిట్టడానికి అనలేదు ఈ మాట. వారు తరించే మార్గం నేనెలా చెప్పగలను— అన్న ఆలోచనతో అన్న మాట ఇది. ఈనాడు మనం సామాజిక స్పృహ గురించి మాట్లాడుతున్నాం. భావియుగం వారు పడబోయే కష్టాలను గురించి ఆలోచించి బాధపడుతున్నాడు వేదవ్యాసుడు. ఇంతకు మించిన సామాజిక స్పృహ ఎలా ఉంటుంది?

అప్పుడు నారదుడు అక్కడికి వచ్చాడు. నారదుడు క్రింది లోకాలలో కలహభోజనుడు. పైలోకాలలో పరమ గురువులకు పరమ గురువు.

"నీ బాధ నాకు అర్థమైంది. భాగవతం రచించు. మహనీయుల జీవిత చరిత్రను గానం చెయ్యి. విషయాన్ని విశ్లేషించడం కన్నా అనుభూతి ప్రదంగా వర్ణించడం వల్ల వ్యక్తి ధర్మానికి మరింతగా ఉన్ముఖుడు అవుతాడు. కనుక మహనీయుల జీవిత కథలను మధురంగా గానం చెయ్యి. అందులో దైవము నిండి ఉంటాడు. కనుక ప్రజలు తప్పకుండా ధర్మానికి ఉన్ముఖులు అవుతారు" అన్నాడు నారదుడు.

నిజమే-గ్రంథాలయంనుండి ప్రేరణ పొందిన వారికన్నా జీవితాల నుండి ప్రేరణ పొందినవారే హెచ్చుమంది. ఒక్క గాంధీ మహాత్ముని ప్రేరణ వల్ల ఎన్ని లక్షల గృహాలలో కదుళ్ళు తిరిగాయో.

సృష్టిలో ఉన్న ధర్మం మానవ దేహం ద్వారా ప్రవర్తన రూపంలో వ్యక్తమైనపుడు అది సద్గుణం అవుతుంది. ఈ సద్గుణాన్ని రుచిచూచిన వాడు ఆ ధర్మం దగ్గరకు నడచివెళతాడు.

నిజానికి వేద ఋషులు, వ్యాసాది మహర్షులు, బెస్ట్ టీచర్స్ మానవ జాతి మొత్తానికి బోధన చేయడానికి అంకితమైనవారు. వారి దయావిశేషం చేత ఇవాళ ఆ పవిత్ర గ్రంథాలు మనకు లభిస్తున్నాయి. మానవ జీవితానికి ఇంతదారి దొరుకుతున్నది. అవి లేకపోతే మనకు దారి లేదు.

మనం డబ్బు సంపాదిస్తున్నాం. ఆ డబ్బుతో ఏమి చేయాలో మనకు తెలియడం లేదు. శరీరం నిలబడితే చాలదు. దానిని సద్వినియోగ పరచుకోవడం తెలియాలి. ఇప్పుడు రష్యాలో అదే అనుభవంలోకి వస్తున్నది. కనుకనే గోర్బచెవ్ ప్రయోగాలు చేస్తున్నాడు.

అలాంటి జ్ఞానం ఇచ్చినవాళ్లు మహర్షులు. వాళ్ళు సిస్టమేటిక్‌గా ఆ జ్ఞానం ఇచ్చారు. ఎవరు చెప్పినా-చతుర్విధ పురుషార్థములనే చెప్పారు. త్రిగుణములనే చెప్పారు. త్రిలోకములనే చెప్పారు. అచ్చమైన దర్శనం

అది. మానవ జీవితానికి పరాకాష్ఠ అది. సమాజంయెడ వారు పడిన బాధ్యతకు భగవంతుడు అందించిన మహత్తర దర్శనం అది.

కాగా, ఉత్తమ ఉపాధ్యాయునికి తన విద్యార్థులు. బాగుపడాలని మనఃపూర్వకమైన ఆర్తి ఉండాలి. అప్పుడు శక్తియుక్తులు అతని వద్దకు నడచివస్తాయి, పండదలచుకున్న భూమి మీదకు నదుల నీరు కాలువల ద్వారా పారివచ్చినట్లు.

నేడు ఆర్తికి బదులు కాంక్ష చోటు చేసుకుంటున్నది. సన్మానాల మీద దృష్టి పెరుగుతున్నది.

పూర్వం-చిన్న వయస్సులోనే పిల్లవాడిని గురుకులానికి అప్పగించే వారు. యువకుడుగా సమాజానికి పనికివచ్చే స్థితిలో అతడు తిరిగివచ్చే వాడు. ఈ లోపల అతడికి ప్రత్యేకమైన పద్ధతిలో శిక్షణ ఇవ్వబడేది.

కానీ, నేడు విద్యార్థిపైన బయటి సమాజం యొక్క ప్రభావం, ముద్రలు పడుతున్నాయి. చదివిన దానిని ఆకళింపు చేసుకోవడానికి అవగాహనకు, అమలుకు, స్వంతంగా ఆలోచించడానికి విద్యార్థికి వ్యవధి చిక్కడం లేదు.

మరో మాట. ఏ వృత్తి అయినా ఆ వృత్తికి తగినవాళ్ళు అందులో ప్రవేశించినపుడే రాణిస్తుంది. మనం ఏ పని చేయడానికి పుట్టామో ఆ పని చేస్తున్నప్పుడు తృప్తి ఉంటుంది జాబ్ సాటిస్‌ఫాక్షన్ ఉంటుంది. ఇందులో ఎన్నడూ రాజీపడకూడదు. "పరధర్మో భయావహః". ఏ ఉద్యోగం పడితే ఆ ఉద్యోగం చేస్తే ధర్మ సంకరం ఏర్పడుతుంది. వాడు దాన్ని వ్యాపారంగా మార్చుతాడు. అమ్ముకుంటాడు.

ఉపాధ్యాయులుగా మనం మన కోర్కెల కోసం, మన కాంక్షల కోసం మన వృత్తి మైలపడే విధంగా ఎన్నడూ ప్రవర్తించ కూడదు.

వైద్య ధర్మం విద్యాబోధన డివైన్ ప్రొఫెషన్స్.

ఉపాధ్యాయునికి నా సూచనలు రెండు. మొదటిది పరీక్ష అనేది గుర్తురాకుండా పాఠం చెప్పాలి. తిరుపతి వెంకటకవులు బందరులో పాఠాలు చెప్పేటప్పుడు 4, 5 ఫారంలలోనే మహాకావ్యాలు బోధించేవారు. పరీక్ష ఒక లెక్కా అనే ధీమా కలిగిన విద్యార్థులు తయారైనారు.

రెండవది మన జీవితం విద్యార్థికి ప్రేరణ ఇచ్చేవిధంగా మనం దానిని మలచుకోవాలి. అంతకన్న మన జీవితానికి ధన్యత లేదు. "ఇతరులు నిన్ను ఆదర్శంగా తీసుకోవాలంటే ధర్మము యెడ కామము యెడ దెబ్బ తిననివాడుగా నీవు మిగిలి ఉండాలి"— అని వేద ఋషి స్నాతకోత్సవంలో విద్యార్థికి హితవు చెప్పేవాడు.

శిష్యుడికి పెట్టుబడి గురువు యొక్క జీవితమే. ఆ ప్రేరణ ప్రేరకపచంగా ఉండాలి అతడికి. సమాజంలో ధర్మసంస్థాపనకు ఇంతకన్నా కావలసింది లేదు.

[విజయవాడ సత్యనారాయణపురంలోని శిశువిద్యామందిరంలో 9-10-88న జరిగిన అధ్యాపక శిక్షణ శిబిరంలో ఇచ్చిన ప్రసంగ సారాంశం.]

# వాక్కు - ఒక కామధేనువు

నాస్తికులు కనబడుతున్నదానిని మాత్రమే నమ్ముతారు. ఆస్తికులు కనబడని దానిని, శాశ్వతమైన దానిని మాత్రమే నమ్ముతారు. ఈ రెండు నమ్మకాలనూ సమన్వయం చేసి సద్వినియోగం చేసుకున్నవాడు ధన్యుడు. ఈ రెంటిమధ్య అనుసంధానాన్ని అందించడం కోసమే దేవీ ఉపాసన.

తాను పదిమంది అయితే బాగుంటుందని దైవానికి కోరిక కలుగగా సృష్టికి అంకురార్పణ జరిగిందని వేదం చెపుతోంది. అలా అనిపించడం ఆయన ప్రకృతి, ఆయన స్వభావం. సృష్టి దివ్యత్వంతో నిండి ఉన్నది. అది మాయకాదు-మాత.

అమ్మా, నీ వ్రేలిని పట్టుకున్నాం మేము. మమ్మల్ని నడిపించేది నీవు. తండ్రి దగ్గరకు తీసుకువెళ్ళేది నీవు- అంటారు శంకరాచార్యులు సౌందర్యలహరిలో, సృష్టిరూపంలో ఉన్న ప్రకృతి మన తల్లి. ఆయన నుండి దిగివచ్చినది. తల్లి త్వరగా ద్రవిస్తుంది. క్షమించవలసిందిగా తండ్రికి సిఫార్సు చేస్తుంది. కనుకనే- రామదాసు, నీవైనా చెప్పవమ్మా ఆయనకు, అన్నాడు.

ఈ రోజున సరస్వతీ స్వరూపం గురించి తెలుసుకుందాం.

ఆ దైవం యొక్క ఉచ్చారణ ఈ సృష్టి అయింది. అది వాక్కు యొక్క ప్రభావం. సరస్వతీ ప్రవాహం. ఈ సృష్టి ఆయన దేహం, ఆయన ప్రకృతి.

అలాగే- ఈ దేహం మన ఉచ్చారణ. తల్లి గర్భాన పడినపుడు ఈ దేహాన్ని మనం ఉచ్చరిస్తున్నాం.

మననుండి వాక్కు వెలువడుతోంది. దైవము నుండి సృష్టి వెలువడుతోంది.

ఈ వాక్కు ఎలా వెలువడుతోంది? మొదట మాట్లాడాలనే సంకల్పం కలుగుతుంది. ఆ తర్వాత ఏమి మాట్లాడాలో భావన కలుగుతుంది. ఆ తర్వాత ఆ భావన భాషలోనికి వస్తుంది. ఆ తర్వాత ఆ భాష వాక్కులోనికి వస్తుంది. ఇలా నాలుగు దశలు ఉన్నవి. మూడు లోపం, ఒకటి బయట.

భగవంతుని ఉచ్చారణలో నాలుగు దశలు. నాలుగు ముఖాలు ఉన్న బ్రహ్మనుండి సరస్వతి వ్యక్తమైంది. ఆ సరస్వతి వెంట ఆయన పడ్డాడు.

పదముల అర్థంగా మారి ఆ వాక్యం వెంటపడుతున్నాయి. అలాగే బ్రహ్మ అర్థస్వరూపుడై సరస్వతి వెంటపడుతున్నాడు. ఉచ్చరిస్తూ, తానే దానిలో వ్యక్తమవుతాడు. రూపధారి. ఆయన రూపకల్పన ప్రకృతి.

ఆయన బృంహణం చేస్తున్నాడు కనుక బ్రహ్మ ప్రపంచింప బడుతున్నది. కనుక ఇది ప్రపంచం.

వాక్కు యొక్క నాలుగు దశలను పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని పిలిచారు. ఆ నాలుగు ముఖాలతో కూడిన శబ్దబ్రహ్మను ప్రసన్నం చేసుకుంటే– మన వాక్కుకు లోతు, రుచి, భావనామయ శక్తి పెరుగుతాయి.

వాల్మీకి, వ్యాస, కాళిదాసులు వాక్స్వరూపాన్ని తెలుసుకుని దాన్ని ఉచ్చరించారు కనుక, వారి కావ్యాలు ఆచంద్రతారార్కం ఉంటున్నాయి. ఆ కావ్యాలు వారి వాక్రూపాలు. అలా తెలిసి మాటాడినవారి మాట

కలకాలం నిలిచిపోతుంది. కనుక మీ వాక్కును మీరు ఉపాసించండి. అదే సరస్వతీ ఉపాసన.

ఆ సరస్వతి హంసవాహన. మనం మన ఉచ్ఛ్వాసను మనస్సుతో వింటే 'సో' అనే ధ్వని వినబడుతుంది. నిశ్వాసనుండి "హమ్" అనే ధ్వని వస్తుంది. సోహం– అనేది నిరంతరం మనలో జరుగుతున్న జపం-మనతో నిమిత్తం లేకుండా, అది అజప మంత్రం అజప గాయత్రి.

సోహంను తిరగవేస్తే హంసో, హంస నిశ్వాసను వాహనంగా చేసుకుని బయటకు వస్తున్నది కనుక ఆమె హంస వాహన.

సరస్వతి సర్వశుక్ల. తెల్లనిది, మాలిన్యములకు అవకాశం లేని స్థితి నుండి ఆ వాక్కు దిగివచ్చే లోపల మన పూర్వ సంస్కారాలు ఆ వాక్కును కలుషితం చేస్తున్నాయి. రాగద్వేషాలతో ఆ సరస్వతి చేత మనం ఊడిగం చేయించుకుంటున్నాం. చాడీలు చెప్పడానికి, కాపురాలు తీయడానికి దుర్వినియోగం చేస్తూ. దాని ఫలితాన్ని అనుభవిస్తున్నాం.

సరస్వతి వీణ మీటుతున్నది. వెన్నెముకతో కూడిన మన తల ఆమె వీణ. ఆవిడ వీణ మీటులు మన మాటలు. వాటి వెనుక అర్థస్వరూపుడై అతడు దిగివస్తున్నాడు. ఆ వాక్కును మనం ఉపాసించ గలగాలి. "కాన్షస్" గా మాట్లాడగలగాలి. ఒళ్ళు తెలిసి మాట్లాడగలగాలి.

అది మొదటిమెట్టు. ఆమెట్టు మీరు వేస్తే చాలు, మిగతా మెట్ల సంగతి అమ్మవారే చూచుకుంటుంది.

మన మాటను మనం గమనించాలి. తెలిసి మాట్లాడాలి. ఆ మాటయెడ మనకు పూజ్యభావం ఉండాలి. పరుషములైన వాక్కులు పలుకకుండా ఉండాలి.

ఒక్కొక్క మాట వింటే మనం "రియాక్ట్" అవుతాం. ఒకొక్క మాట వింటే 'రియలైజ్' అవుతాం. ఉద్వేగపరచే మాటకు, నిజస్వరూపాన్ని తెలిపే మాటకూ ఎంత తేడా ఉంది.

మనం మన వాక్కు ద్వారా ఆ తల్లిని ఉపాసించాలి ఆరాధించాలి ఆవిధంగా వాక్కును సద్వినియోగం చేసుకోవాలి. అప్పుడు ఆ వాక్కు వల్ల భూలోకానికే కళ్యాణం జరుగుతుంది కళ్యాణీ రూపంలో ఆమె మీ నుండి వ్యక్తమవుతుంది కళ్యాణీ వాక్కు అవుతుంది.

భగవద్గీత శ్లోకాలు అలాంటి వాక్కుకు ఉదాహరణలు. ఒక్క "కర్మణ్యేవ అధికారస్తే" శ్లోకంలో ఎంత అర్థం ఇమిడి ఉంది? ఫలితం విషయం నాకు వదిలేయ్ అలసుడవు కావద్దు పనిచేయడంలో ఉన్న ఆనందాన్ని అనుభవించు అని బోధిస్తోంది ఆ శ్లోకం.

మన వాక్కు అలాంటి సంస్కారాన్ని పుణికిపుచ్చుకోవాలి. వాక్కును తపస్సుగా వెలువరించే స్థితి రావాలి. వాక్ స్వరూపాన్ని అర్చన చేయాలి. అవతలి వ్యక్తికి తృప్తిని, ఆనందాన్ని కలిగించే మాట మాట్లాడాలి.

వాక్కు ఒక కామధేనువు. మనం ఏది అడిగితే అది ఇస్తుంది. 'నెగెటివ్ వర్డ్స్' పలకవద్దు. 'పాజిటివ్' గా మందలించాలి. 'బియ్యం నిండుకున్నవి' 'దీపం కొండెక్కింది' అనడం మన సంప్రదాయం. కనుక లేదు. కాదు, వద్దు వంటి మాటలతో నెగెటివ్ మేగ్నెటిజమ్ డెవలప్ చేయకండి.

జీవితంలో పాఠాలు ఇవే. 'నువ్వు ఇలా చేయలేదు' అని కాక- 'నీ స్థానంలో నేను ఉంటే ఇలా చేస్తాను' అని చెప్పాలి. నాలుక అనే తాళపు చెవితో తాళం వేస్తారో తీస్తారో అంతా మీ చేతుల్లో ఉంది.

మనం వాక్కును సాధన చేయాలి- "అవేర్"గా ఎలర్ట్‌గా ఉండి.

తల్లి స్పర్శలో ఆనందం ఉంది. నిరంతరం మన నుండి వెలువడు తున్న సరస్వతీ ప్రవాహంయొక్క స్పర్శను మనం అనుభవించగలిగితే- మన జన్మ ధన్యమవుతుంది.

మన మాటమీద మనం నిలబడిన రోజున, అసత్యం అనేది పలకని రోజున, వాక్కును సాధనగా తపస్సుగా మలచుకున్న రోజున- వాక్ సరస్వతి మననుండి ప్రవహిస్తున్న దివ్యానుభూతిని మనంపొందగలుగుతాం మన మనస్సు లోపలి మూడు వాక్కులనూ దర్శనం చేస్తూ, బయటి నాలుగో వాక్కును ఉచ్చరించే స్థితిలో ఉన్నప్పుడు- మనకు చతుర్ముఖత్వం సంప్రాప్తం అవుతుంది. నిరంతరం బ్రహ్మగా జీవించగలిగే దివ్యస్థితికి మనం నోచుకుంటాం.

(18-10-88న దుర్గాష్టమి సందర్భంగా విజయవాడ శిశువిద్యా మందిరంలో ఇచ్చిన ప్రవచన సారాంశం.)

# జీవితం దక్షయజ్ఞం కారాదు

నారాయణుడి నాభి నుండి కమలం ఆ కమలం నుండి చతుర్ముఖ బ్రహ్మ వ్యక్తమై, ఆ బ్రహ్మ సరస్వతీ సాయంతో సృష్టి చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. మొదట నారదుడు, సనక సనందనాదులు, రుద్రుడు దిగి వచ్చారు. స్థూల జగత్తుకు రావడానికి వారెవరూ అంగీకరించలేదు. ఆ తర్వాత దిగివచ్చిన ప్రజాపతులు అంగీకరించారు. సృష్టికి స్థూలమైన రూపకల్పన ప్రారంభమైంది. తీక్ష్ణమైన ప్రజాపతి దక్షుడు. భార్య ప్రసూతి. గర్భధారణకు ప్రతినిధి అయిన ప్రజ్ఞ ఆమె బొమ్మలు కలిస్తే కొత్త బొమ్మలు వచ్చే ఏర్పాటు ప్రారంభమైంది దానితో దక్షునికి ఇదంతా తనదే అనే అహంకారం ఏర్పడింది. ఒకచోట యజ్ఞం జరుగుతోంది. దక్షుడు వెళ్ళాడు. దేవతలంతా లేచి నిలబడ్డారు. అల్లుడైన శివుడు లేవలేదు. దక్షుడికి కంపరం కలిగింది. శివునికి యజ్ఞభాగాలు లేకుండా చేశాడు. అహంకార స్వరూపుడైన దక్షునికి బయటకు నమస్కరిస్తే అతని అహంకారం పెరుగుతుంది. కనుక మనస్సులోనే నమస్కరించాడు శివుడు.

తర్వాత కొంతకాలానికి దక్షుడు పెద్ద యజ్ఞం తలపెట్టాడు భారీ యెత్తున సన్నాహాలు జరుగుతున్నాయి. చెల్లెళ్ళు యజ్ఞానికి వెళుతూ ఉండడం సతీదేవి చూచింది. "మనమూ వెళితే ఎలా ఉంటుందని ఆమె శివుడిని అడిగింది. వాళ్ళు అహంకార ప్రేరితులు. నిన్ను గౌరవించరు. నీవు సహించలేవు, ఆలోచించుకో అన్నాడు. తండ్రిమీద ఉన్న మమకారం వల్ల వెళ్ళాలని: అనిపించింది సతీదేవికి. వెళ్ళింది. యజ్ఞశాల లోపలకు వెళ్ళగా, దక్షుడు ముఖం త్రిప్పుకున్నాడు. సతీదేవి కడుపు తరుక్కుపోయింది. నీవు ఇచ్చిన శరీరం విడిచే వరకు నాకు మనశ్శాంతి ఉండదు" అని ఆమె యోగాగ్ని రగిలించుకుని అందులో శరీరాన్ని విడిచింది.

ప్రమథగణాలు వెళ్ళి శివునితో చెప్పారు. "కొంప మునిగింది. అమ్మగారు వెళ్ళిపోయారు. శివుడు భయంకర స్వరూపుడైనాడు. ఆయన జటలు మంటలుగా కనిపించాయి. తన కేశపాశాన్ని నేలమీద కొట్టాడు. వీరభద్రుడు పుట్టుకువచ్చాడు. దక్షుని సంగతి చూడమన్నాడు శివుడు. వీరభద్రుడు ప్రమథ గణాలతో బయలుదేరాడు. దక్ష యజ్ఞాన్ని ధ్వంసం చేశాడు. దక్షుడు చచ్చి పడిపోయాడు.

దైవానికీ దేహానికీ మధ్య అహంకారం పుట్టుకు వస్తుంది. ఆ అహంకార స్వరూపుడు దక్షుడు. దైవాన్ని తలవకుండా దేహ యజ్ఞాన్ని జరుపుతున్నాడు.

మనం కూడా మన హృదయంలో ఉన్న దైవాన్ని పిలువకుండా ఈ దేహ యజ్ఞాన్ని జరుపుతున్నాం అతడిని సంప్రదించడంలేదు. అతడికి భాగం ఇవ్వడం లేదు. మన అహంకారాన్ని బట్టి మన మనస్సును బట్టి, ఆ మనస్సు యొక్క పూర్వ సంస్కారాలను బట్టి, కాంక్షలను బట్టి రాగద్వేషాలను బట్టి- ఇంద్రియాలనూ, శరీరాలనూ, మనం వినియోగించు కుంటున్నాం. ఆ లోపల కూర్చున్న వాడిని మనం ఎన్నడూ పిలిచింది లేదు. పిలవకుండానే ఈ జీవితం అనే దక్షయజ్ఞం నడిచిపోతూ ఉంది. పాపం ఆయిన సాక్షిమాత్రుడుగా చూస్తూఉన్నాడు. ఆయనను పిలిస్తే- మనిషి త్రాగుబోతు కాగలడా? అన్యాయాలు చేయగలడా? దొడ్డిదారిన పదవులు సంపాదించగలడా? ఇంకొకడిని అణగద్రొక్కాలని ప్రయత్నించగలడా?

శరీరం అనేది ఆయన కొరకు నిర్మాణం చేయబడింది దానిని తనకు ఉపయోగించుకుంటున్నాడ. మనిషి జీవితమనే యజ్ఞం ఆయనకు సమర్పణగా జరగవలసి ఉండగా, "ఈ యజ్ఞానికి కర్తను నేనే.. శివుడికి భాగం లేదు" అంటున్నారు కొందరు.

ఇపుడు చూడండి– ఎవరి జీవితాలు దక్ష యజ్ఞాలుగా సాగుతున్నాయో! అలా సాగుతున్న స్థితిలో కూడా దేహం నిలబడే ఉంటోంది ఈ ప్రాణశక్తి పని చేస్తూనే ఉన్నది ఇదే అమ్మవారు దక్ష యజ్ఞానికి రావడమంటే. ఎపుడైతే దైవానికి కాక అహంకారానికి సమర్పణగా జీవితాన్ని గడపడం మొదలు పెడతావో–అపుడు అమ్మవారు నిలబడలేని స్థితి వస్తున్నది. ఆవిడ దహించుకు పోతున్నది. ఆ క్షణంలో పుట్టే వీరభద్రుడు, అతని సేన, యజ్ఞవాటిక మొత్తాన్ని ధ్వంసం చేస్తున్నాడు. ఉగ్రరోగ స్వరూపాలుగా, కేన్సర్, ఊపిరితిత్తులలో పుండు, జీర్ణాశయంలో అల్సర్, ఎపుడైతే ఆ ప్రాణశక్తి నేనిక్కడ ఉండను అన్నదో–ప్రమథ గణాలు వచ్చేస్తారు. ఇక ఈ దక్షయజ్ఞాన్ని మేము సాగనివ్వం. ఈ యజ్ఞవాటికను మేము నిలబడనివ్వం – అంటారు. దారుణ ఘోరణ వ్యాధుల స్వరూపాలు ధరిస్తారు. ప్రమథ గణాలు విజృంభిస్తారు.

హృదయస్థుడైన భగవంతుణ్ణి పిలవకుండా స్వంతంగా జీవించడానికి ప్రయత్నిస్తున్నపుడు, ఈ శరీరంలోని శక్తి తప్పుకుంటుంది. ఆపైన ఉగ్రరోగ సంకలితమై ఈ శరీరం వెళ్ళిపోతుంది. ఇదీ దక్షాధ్వర ధ్వంసం అంటే. జీవితం దక్షాధ్వరం అయినంతవరకు ఈ ధ్వంసం తప్పదు

మీరెన్ని మందులు పుచ్చుకున్నా జీవితాన్ని దక్షుడికి కాక లోపల ఉన్న శివుడికి సమర్పించడం మొదలు పెడితేనే ఆరోగ్యం చక్కబడుతుంది. "హైయర్ పర్సన్" తెలిసి, దానికి "సరండర్" అయితేనే– సర్వరోగాలకి పరిష్కారం దొరుకుతుంది. ఎందుకంటే–

దేవతలు, ఋషులు గుంపులు గుంపులుగా పనిచేస్తూ ఉన్నందు వల్లనే ఈ శరీరం అనే యజ్ఞశాల నడుస్తున్నది. ఈ శరీరంలో త్రేతాగ్నులు ఉన్నాయి.

వైశ్వానర అగ్ని ఉదరంలో ఉంటుంది దేవుడికి చూపించి తింటే ఆ భోజనానికి రుచి వస్తుంది. అనుభవంలో ఉన్న విషయం ఇది. నైవేద్యం ఉంటే- నై-వైద్యం. ఆ పూజ్యభావం లేనిచోట ఆ ఆహారం దక్షుడికి వెళ్ళి పోతుంది. అగ్నికోసం కాక రుచికోసం తింటే-అది దక్షయజ్ఞం అవుతుంది. కనుక-సహస్రనామం చదువుకుంటూ వంట చెయ్యండి. భోజనాన్ని హవిస్సుగా, సమర్పణగా చూడండి.

శిరస్సులోని అగ్ని ఆహవనీయం. మనస్సు, భావనలు, ఆలోచనలు, ఊహలు, గ్రహించే శక్తి-ఇదంతా ఆహవనీయ అగ్ని. దీనికి దారుణమైన హవిస్సు వేస్తున్నాం. శివ సాహిత్యంలా, పెద్దల వాక్కులు వినడం సజ్జనగోష్ఠి సరైన హవిస్సులు.

దక్షిణాగ్ని దాంపత్య ధర్మానికి సంబంధించినది. దాంపత్య సంబంధమైన కోరికను పవిత్రంగా ఉంచండి. మైలపడనివ్వకండి.

ఇలా ఆహారంలో, ఆలోచనలో, దాంపత్య ధర్మంలో శివుడికి భాగం పెట్టాలి. అపుడు దేశానికి కావలసిన వాళ్ళు పుడతారు ఆయనను స్మరించినంతవరకే ఈ శరీరం మనకు అక్కరకు వచ్చేది.

అలా దక్షయజ్ఞ ధ్వంసం తర్వాత దేవతలు శివుడికి భాగం ఇస్తామని చెప్పడంతో, శివుడు దక్షుడిని బ్రతికించాడు-గొర్రె తలతో.

అనగా- కాలచక్ర గమనంలో మేషరాశితో సృష్టి మళ్ళీ ప్రారంభమైంది.

ఇపుడు- ఈ దేహ యజ్ఞంలో ఆయనను మనం పిలుస్తున్నామా? పిలిస్తే ఈ జీవితం ధన్యం లేకపోతే ఇది ఒక దక్షయజ్ఞం. పిలిస్తే అమ్మవారు సంతోషిస్తుంది. ఈ శరీరం కళకళలాడుతుంది విప్పారిన గులాబిపూవులా.

[19-10-88న మహానవమి సందర్భంగా విజయవాడలోని శిశువిద్యామందిరంలో ఇచ్చిన ప్రవచన సారాంశం]

# నీలోని నాలోని తారకాసురుడు

సతీదేవి మరొక జన్మ తీసుకున్నది. అందుకు హిమవంతుడిని ఆశ్రయించింది. ఆయన హిమాలయాలకు అధి దేవత అతనికీ మేనకకు వివాహం జరుగగా, మైనాకుడు, పార్వతి జన్మించారు.

హిమవంతుడు జ్ఞానసంపన్నుడు. పార్వతీదేవి ఎందుకు శరీరం స్వీకరించిందో దర్శనం చేసి ఆమెను పెంచుతున్నారు. ప్రేమతో బాధ్యతతో హిమవత్ పర్వతంపైన తపస్సు చేస్తున్న శివునకు సేవకురాలుగా యుక్తవయస్సు వచ్చిన పార్వతిని నియోగించాడు.

ఇలా ఉండగా దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళారు. తారకాసురుడు మా తాట వలిచేస్తున్నాడని మొర పెట్టుకున్నారు. బ్రహ్మ అన్నాడు. ప్రస్తుతం నేను చేయగలిగింది లేదు. నేనే అతనికి వరాలు ఇచ్చాను కనుక. అయితే పరిష్కారం చెపుతాను. మీకు సేనాధిపతి కావాలి. అందుకు పార్వతీ పరమేశ్వరులు ఒకటి కావాలి. వారికి కుమారస్వామి పుట్టాలి. అతని చేతిలో తారకాసురుడు చావాలి.

స్వప్రయోజన కాంక్షా స్వరూపుడు తారకాసురుడు. కాంక్షల కోసం జీవితాలను దగ్ధం చేస్తున్న వారంతా తారకాసురులే. దేహ భవనంలోని దేవతల చేత తమ కాంక్షలకోసం ఊడిగం చేయించుకుంటున్న వాళ్ళంతా తారకాసురులే.

అప్పుడు ఇంద్రుడు మన్మధుడిని తలచుకున్నాడు. మన్మధుడు వచ్చాడు. "ఏమి చేయమంటారు? నేను తలచుకుంటే ఆ పరమశివుణ్ణి అయినా దారికి తెస్తాను"- అన్నాడు. ఆ పనే చేయవలసిందని ఇంద్రుడు అతన్నిని పంపించాడు.

మన్మథుడు బయల్దేరాడు అకాల వసంతాన్ని సృష్టించాడు. నందీశ్వరుడు దాన్ని గమనించాడు ఆ ప్రభావాన్ని ఆపివేశాడు. పార్వతీ దేవి శివుని శుశ్రూషకు బయలుదేరి వస్తున్నది మన్మధునికి మళ్ళీ ధైర్యం వచ్చింది. శివుడు ధ్యానంనుండి దిగివచ్చాడు. పార్వతి నమస్కరించింది. 'తగిన భర్తను పొందుదువుగాక' అని శివుడు ఆశీర్వదించాడు.

ఆ అదను చూచి మన్మధుడు బాణం వేశాడు పరమశివుడు పార్వతి సౌందర్యం చూసి క్షణకాలం తబ్బిబ్బు అయి, నిల్ద్రొక్కుకున్నాడు. చుట్టూ కలయచూశాడు. దూరాన మన్మధుడు. శివుడు మూడో కన్ను తెరిచాడు. మన్మధుడు కాలిపోయాడు తన సౌందర్యంతో శివుడిని జయించలేకపోయినందుకు పార్వతి అవమానపడింది సిగ్గుతో వాలిపోయింది.

ఆ తర్వాత తపస్సుచేసి ఆయనను సాధించుకుంటానని తపశ్చర్యకు సిద్ధపడగా అమ్మ వారించింది నీవు ఓర్చుకోలేవు అన్నది. నాన్నతో చెప్పింది అతడు తెలిసి పెంచుతున్నవాడు. తప్పకుండా చేయి-అన్నాడు. తగు ఏర్పాట్లు చేశాడు.

పార్వతి నారచీరలు ధరించింది. ఋష్యాశ్రమ వాతావరణ పరిపోషణకు తనను తాను మలచుకున్నది. తీవ్ర తపస్సు ప్రారంభించింది. ఆహారం, పానీయము విసర్జించింది. అపర్ణ అయింది. ఆకులను కూడా తినను. ఆయన కొరకే జీవించి ఉంటాను. అనుకున్నది.

తల్లి ఉ [ఓ పిల్లా] మ [వద్దు] అన్నది. కనుక ఆమెకు ఉమ అని పేరు వచ్చింది.

అలా ఆకలన్న తలంపే లేక ఆకులను కూడా ముట్టక ఆమె తపస్సు చేస్తున్నది. ఆ దివ్య తపస్సుకు ముగ్ధులై ఋషులు వచ్చి నమస్కరిస్తున్నారు.

ఒక బ్రహ్మచారి రూపంలో శివుడు వచ్చాడు. పార్వతి ఆయనకు అతిథి మర్యాదలు చేసింది.

ఆ బ్రహ్మచారి మొదలు పెట్టాడు—అయినా మీకు తపస్సేమిటండీ! తపస్సుకూ, మీ సున్నితత్వానికీ పొంతన ఏమిటండి? ఏం తక్కువ మీకు? కులము, ధనము, వయస్సు, మేధాసంపత్తి—ఏమి తక్కువ?

పార్వతి చెలికత్తెవైపు చూసింది. పరమశివుని పొందుకోసం ఆమె తపస్సు చేస్తున్నదని చెలికత్తె చెప్పింది. అవును, ఆయన సాక్షాత్కారం కోసం తాదాత్మ్యం కోసం తపస్సు చేస్తున్నాను—అని పార్వతి అన్నది.

బ్రహ్మచారి నవ్వాడు.

ఇది అంత మంచిదిగా అనిపించడం లేదు ఆయన చేతికి పాము ఉంటుంది. మెడలో పాము, జుట్టులో పాము. అతడు పాములవాడు. నెత్తురుతో నిండిన జంతుచర్మం ధరిస్తాడు. ఒళ్ళంతా స్మశానంలోని వెలిబూడిద ఆయనను పెళ్ళి చేసుకుంటే—బొమికలు పుర్రెలతో కూడిన స్మశానంలో కాలు పెట్టాలి మీరు, ఇవన్నీ ఆలోచించారా? ఆయన తల్లి ఎవరో తండ్రి ఎవరో! దిక్కులేనివాడు. దిగంబరుడు, మూడు కన్నులతో ఏమి బాగుంటుంది ఆ ముఖం?

పార్వతి ఆ మాటలకు తట్టుకోలేకపోయింది. ఆయనకు సంపద లేదు. అయినా అందరికీ సంపదలు ఇచ్చేవాడు. ఆయన స్మశానంలో ఉంటాడు. అయినా సకల జగత్తుకూ నాథుడు ఆది అంతము లేనివాడు. దిగంబరుడు. ఈ దిక్కులే అంబరములుగా కలిగినవాడు. అంత సౌందర్యాన్ని స్వీకరించే కన్ను ఉండాలి. లేనివాడికి నేను చెప్పగలిగింది లేదు—అని సమాధానం చెప్పింది పార్వతి.

ఆ సమాధానానికి తృప్తిపడి పరమశివుడు నిజస్వరూపం ప్రకటించాడు వారిద్దరికీ వివాహం జరిగింది. కుమారస్వామి జన్మించి దేవతలకు సేనాని అయి తారకాసురుడిని సంహరించాడు

మరి ఈ కథలోని అంతరార్థ మేమి?

స్వప్రయోజనాన్ని కాంక్షించే స్థితి. తారకాసుర స్థితికి దేవతలందరూ బంధింపబడి ఉండటంతో హృదయ స్థానంలో ఉన్న శివుడు, దేహ స్వరూపంలో ఉన్న అమ్మవారు విడిపోయి వున్నారు. తపస్సులోనికి దిగినప్పుడే శరీర రూపంలో ఉన్న ప్రకృతిని హృదయస్థానంలో ఉన్న శివుడు స్వీకరిస్తాడు.

శరీరాన్ని అలంకరించుకోవడం గమ్యం కాదు. శరీరాన్ని సద్వినియోగం చేసుకోవడం అనే తపస్సు చేస్తూ ఉంటే, ఆ పరమశివుడు పరీక్షించి నిన్ను తనలోనికి స్వీకరిస్తాడు. మన నిత్య జీవితాన్ని ఒక తపస్సుగా రూపొందించుకున్నప్పుడు పరమేశ్వరుడు తానుగా దిగి వచ్చి చేయి అందిస్తాడు.

ఈ సృష్టిలో దేనినీ కోరనక్కర లేదు దేనినీ వదలనవసరం లేదు. తపస్సు స్వరూపంగా దానిని మనం నిరంతరం స్వీకరింపవచ్చు. వివాహం, బిడ్డలను పెంచడం, వృత్తి వ్యాపారములు అన్నీ తపస్సులే. జీవితం ఒక తపస్సు. కోర్కెలతో, కాంక్షలతో మీరు తిరుగుతున్నంత వరకు ఆ పరమేశ్వరుడు మెచ్చడు. కోరిక కరిగిపోయి ఆయనకు అంకితమైన వేళ ఆయనే తానుగా వచ్చి మనల్ని స్వీకరిస్తాడు.

జీవితం పరిపూర్ణంగా వికసించాలంటే కోరిక అనేది భస్మమైపోయి, కర్తవ్యం ఒక్కటే మిగలాలి.

ఆయన మిమ్మల్ని స్వీకరించిన వేళ ఉద్బుద్ధమయే దివ్యోత్సాహమే కుమారస్వామి.

(20-10-88 విజయదశమినాడు విజయవాడలో ఇచ్చిన ప్రవచన సారాంశం.)

# లో వెలుగుల వెల్లువ అది

పూర్వం హిరణ్యాక్షుడు భూమిని చాప చుట్టినట్లు చుట్టి పట్టుకు వెళ్ళాడు. అప్పుడు విష్ణుమూర్తి వరాహమూర్తిగా దిగివచ్చి తన కోరలపై భూమిని ఉద్ధరణ చేశాడు. ఆ తర్వాత ఆయనకు, భూదేవికి నరకాసురుడు జన్మించాడు.

కృష్ణావతార సమయంలో నరకాసురుని ఆగడాలు మితిమీరి పోయాయి. శ్రీకృష్ణుడు అతని రాజధాని ప్రాగ్జ్యోతిషంపై దండ యాత్రకు బయలుదేరాడు. నేనూ వస్తానన్నది సత్యభామ. యుద్ధరంగంలో మిమ్మల్ని చూడాలని ఉన్నది అన్నది. నేను క్షత్రియ వనితను అన్నది. సరే అన్నాడు శ్రీకృష్ణుడు.

ఇలా భార్యతో కలసి కదన రంగానికి వెళ్ళిన మరో మహనీయుడు శ్రీకృష్ణదేవరాయలు. ఆయన జైత్రయాత్రలకు వెళుతున్నప్పుడు ఒకరిద్దరు భార్యలు, మంత్రులు, కవులు వెంట ఉండేవారు. ఆ యాత్రలలో కవితా గోష్ఠులు జరుగుతూ ఉండేవి. ప్రయాణంలో ఎక్కడ చీకటి పడితే అక్కడికి సమీపంలో ఉన్న దేవాలయానికి వెళ్ళి ఆయన భూశయనం చేసేవాడు. అలాంటి సమగ్ర జీవితం ఆయనది. దక్షిణ దేశపు జనకునిగా ఆయనను పరిగణిస్తారు తెలిసినవారు. రాజయోగ వైభవం కనిపిస్తుంది ఆయన జీవితంలో.

కాగా – ప్రాగ్జ్యోతిషం సమీపంలో శ్రీకృష్ణునికి ఐదుతలల మురాసురుడు ఎదురు వచ్చి – 'ముందు నాకు జవాబు చెప్పు' అన్నాడు. శ్రీకృష్ణుడు అతనిని అవలీలగా వధించాడు. ట్రయల్ అండ్ ఎర్రర్

మెథడ్ లేదు ఆయన దగ్గర. ఏ పని ఎవరి వల్ల జరగాలో, తన వల్ల ఏ పని జరుగుతుందో తెలుసుకుని, ఆయా పనులు ఆయా విధంగా జరిపిస్తాడాయన.

ఆ తర్వాత నరకాసురుడు యుద్ధరంగంలో ప్రవేశించాడు. సత్యభామ అన్నది- నేను యుద్ధం చేస్తానని శ్రీకృష్ణుడు విల్లు అందించాడు. ఆమె యుద్ధం చేసిన ఘట్టాన్ని పోతన అద్భుతంగా వర్ణించాడు. ఆమె శ్రీకృష్ణుని వంక చూసే చూపులో సరస శృంగార లీలా విలాసం విజృంభిస్తున్నది. నరకుని చూచే చూపులో మహావీరం విజృంభిస్తున్నది ఏకకాలంలో శృంగార, రౌద్రములను ఆమె ప్రదర్శించింది

భారత దేశంలో స్త్రీలు తమ భర్తలకు క్రెడిట్ ఇవ్వడానికి మాత్రం ఒదిగి ఉంటున్నారు. చేత కాక కాదు- అనే హెచ్చరిక చురక ఉన్నది ఆ ఘట్టంలో. స్త్రీ శక్తి స్వరూపిణి. అయినా- నేపథ్యము నందు ఉండుట యందు ఆనందము అనుభవిస్తుంది. కాని, సమయం వచ్చినప్పుడు విజృంభిస్తుంది.

అప్పుడు నరకుడన్నాడు- 'నేను స్త్రీలను వధించ లేను. రంగంలోకి రా' శ్రీకృష్ణుడు అవలీలగా అతడిని వధించాడు అతడి తల భూమి మీద పడుతుంది- అమ్మా నీ ఒడిలో వాలిపోతున్నాను, అన్నట్లు.

అప్పుడు భూదేవి ప్రత్యక్షమై అన్నది- 'వాడితప్పుకు ఫలితం వాడు అనుభవించాడు. వాడి కుమారుడు భగదత్తుడు ఉన్నాడు. అతడు ధర్మానికి కట్టుబడి ఉంటాడు రాజ్యాన్ని అతనికి అప్పగించు'.

శ్రీకృష్ణునికి ధర్మసంస్థాపన దృష్టి తప్ప ఆక్రమణ దృష్టి లేదు. ఆ రాజ్యాన్ని భగదత్తునికి అప్పగించాడు.

నరకాసురుని బారి నుండి విమోచనం లభించినందుకు లోకమంతా సంబరం చేసుకున్నది. జ్యోతులు వెలిగించి దీపావళి చేసుకున్నది.

ఆ తర్వాత నరకాసురుడు చెరపట్టిన 16,000 మంది క్షత్రియ వనితలను శ్రీకృష్ణుడు చెర విడిపించి – 'మీ కోరిక ఏమిటి?' అని అడిగాడు. 'నీవు మమ్మల్ని స్వీకరించు' ఆయన కాదన లేదు.

ఆయన జీవితంలో ఒక విశేషం ఉంది. ఆయననే అందరూ పెళ్ళి చేసుకున్నారు– రుక్మిణితో మొదలు పెట్టి ఆయన ఎవరినీ పెళ్ళి చేసుకోమని అడగలేదు ఆయన అస్ఖలిత బ్రహ్మచారి.

అలా ఆయన ఆ క్షత్రియ వనితలకు పునరుజ్జీవనం కల్పించాడు. తన హృదయంలోనికి స్వీకరించాడు. తన జీవితంలో భాగం ఇచ్చాడు. పాణిగ్రహణం చేసుకున్నాడు. ఉదాత్తమైన నాయకుడు ఆయన.

మరి ఈ గాథలోని అంతరార్థమేమి? జీవి శరీరాన్ని స్వీకరిస్తున్నప్పుడు తల్లి గర్భములోని జలము నుండి ఈ దేహము ఉద్ధరింపబడుతుంది. అదే వరాహావతారం. సృష్టిలో జరుగుతున్న కథ.

అయితే, దేహ స్వీకరణ జరిగిన తర్వాత నరకాసురుడు పుట్టే అవకాశం ఉన్నది. రక్షస్సులు అనగా రక్షించేవారు, జీవ ప్రజ్ఞలు, లోపల ఉన్న వాడికి రక్షణగా ఏర్పడిన వారు. దేహ భావన పెరిగినప్పుడు, దేహస్థ ప్రజ్ఞలనే దేహమని అనుకున్నప్పుడు ఆ మరచిన స్థితిలో రక్షకులుగా, సహకారులుగా ఉండవలసిన శక్తులు భక్షక శక్తులుగా మారతాయి. దేహ భావం విజృంభిస్తే నరకుడనే రాక్షసుడు జన్మిస్తాడు. ఈ దేహం కొరకు జీవిస్తాను. ధర్మబద్ధంగా ఎందుకు జీవించాలి? అనుకుంటాడు. దేహ భావం విజృంభిస్తే రాక్షసత్వం ధర్మ భావం వికసిస్తే దైవత్వం.

శరీరమే నేను- అని విగ్రహీగదం వల్ల మనిషికి ఒక పొగరు వస్తుంది. పీడించే లక్షణం వస్తుంది. కండకావరం అనే చీకటి ఏర్పడుతుంది. అదే నరకాసుర ప్రజ్ఞ. దైవప్రజ్ఞలు ఆ చీకటికి లోనై పోతాయి.

ఒక దశలో ఆ పొగరును, ఆ క్రౌర్యాన్ని దేహం భరించలేక పోతుంది. దేహతత్వం భూమి తత్వమే. ఆ భూమి పుత్రిక సత్యభామ. ఆవిడకూడా యుద్ధానికి వస్తుంది.

జీవ సాధనలో, యోగ సాధనలో శరీరము అసురస్థితికి తట్టుకొనలేక హృదయమునందున్న దైవముతో కూడబలుకుకున్న వేళ నరకాసుర వధకు అంకురార్పణ జరుగుతుంది.

నరకుని సేనాధిపతి ఐదు తలల వాడు. కండకావరం పంచేంద్రియ ప్రవృత్తిని ఎలా వాడుకుంటుందో చూపుతుంది ఇది.

మొత్తం పృధివీతత్వం తల్లి అయితే, మనయందున్న పృధివీతత్వం కుమార్తె అవుతుంది. ఆ దేహం సహకరిస్తేనే నరకాసుర సంహారం జరుగుతుంది. కనుక దేహాన్ని నిందించకూడదు. ఇంద్రియాలను సంస్కరించుకుని, కలుపుకుని సాధించాలి. అపుడు జీవితం మలుపు తిరిగి యోగ సాధన వైపు ప్రయాణం సాగుతుంది. సరికొత్త జీవితం ప్రారంభం అవుతుంది. దేహ భావం ఉంటుంది కాని నీవు చెప్పిన ప్రకారం నడుచుకుంటుంది భగదత్తుని వలె.

ఆనాడు- ఆ పొగరు అనే చీకటి తొలగిన వేళ - మనలోని ఋషులకు, దేవతలకు, సకల ప్రజ్ఞలకు వెలుగులోకం భాసిస్తుంది. వివేక సూర్యోదయం జరుగుతుంది మన జీవితానికి తెల్లవారుతుంది.

అపుడు మన మనస్సుకు సంబంధించిన 16,000 అనుభూతి కక్ష్యలు యోగ స్థితిలోనికి వెళ్ళి మన మనస్సు ఒక మధుకలశమై, అమృత భాండమై భాసిస్తుంది. ఆ అనుభూతులు హృదయ స్థానంలో ఉన్న వాడిని అధినాధుడుగా వరిస్తాయి.

[8-11-88న దీపావళి సందర్భంగా ఇచ్చిన సందేశ సారాంశం]

# బైబిల్ భగవద్గీతకు భాష్యం-1

"నేను దేవుని పుత్రుడను. ఆయన సామ్రాజ్యంలోనికి మిమ్మల్ని నడిపించడం కోసం ఈ భూమి మీదకు పంపబడ్డాను. సోదరులారా! ఈశ్వర సామ్రాజ్యంలోనికి ప్రవేశిద్దాం. రండి"

అనే చల్లని పిలుపును, విలువైన సందేశాన్ని అందించిన ఒక మహా ప్రవక్త జన్మదినం ఈ రోజు.

ప్రవక్తలు, అవతార మూర్తులు మానవాళికి అన్ని కాలాలలోనూ అవసరమైన సందేశాన్ని ఇవ్వడానికి దిగివస్తారు. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు శరీరాలు విడచి ఎన్నివేల సంవత్సరాలైనా వారి సందేశం నిత్యనూతనం. వారి పిలుపు వినబడుతూనే ఉంటుంది. మన గుండె చప్పుడు లాంటిదది. ఆగేది కాదు.

అలాంటి మహనీయుల నేపథ్యాన్ని వారిలో అంతర్లీనంగా ప్రవహిస్తున్న ఏక సూత్రాన్ని భారతీయులు అవతార తత్వం అన్నారు. రాముడిని, కృష్ణుడిని, బుద్ధుడిని వేరుగా చూడలేదు. మరి క్రీస్తును వేరుగా ఎందుకు చూడాలి. భారత ధర్మం ప్రకారం చూడకూడదు ఒకే వెలుగు దేశకాలాలకు తగిన పద్ధతిలో శాశ్వతమైన ధర్మాన్ని అందించడం కోసం అనేక ప్రదేశాలలో అనేక మూర్తులలో దిగివస్తుంది. అపుడు హరే రామ హరే కృష్ణ అనే నామం వస్తుంది. ఇదే సంప్రదాయాన్ని ఏసు ప్రభువు పుట్టిన దేశాల వారు "రక్షకుడు" "క్రైస్ట్" అన్నారు. భగవంతునికి ఈ దేశం, ఆ దేశం అని ఉంటుందా? ఆ ఆదేశానికి లొంగనిది ఉంటుందా?

మానవీయ పరిధులను దాటి మహనీయుల దర్శనాన్ని చూచినపుడు ఒక చిత్రమైన, దివ్యమైన ఏకత్వం గోచరిస్తుంది. కనుక ఒక్కొక్క మూర్తి పేరిట ఒక్కొక్క మతాన్ని మనం పెట్టం. రామ మతం, కృష్ణ మతం లేదు.

ఒక మహనీయుడు మాట్లాడుతున్నప్పుడు చెప్పబడుతున్నది ఏమిటి అని చూస్తే ధర్మం తెలుస్తుంది. చెపుతున్నది ఎవరు అనే దానికి ప్రాముఖ్యం ఇస్తే మతం పుడుతుంది. వారి పేరిట మతాలు పెట్టుకునే సంకుచిత స్థితికి మానవజాతి దిగజారకూడదు.

అందుకే క్రీస్తు కూడా "లెట్ దేర్ బి నో సైన్ ఫర్ మై జనరేషన్" అన్నాడు "నన్ను అనుసరించువారు వేరుగా గుర్తించబడకుందురుగాక! వారి కుంపటి వారు వేరుగా పెట్టుకొనకుందురుగాక ఈ విశ్వస్రవంతిలో కలసిపోవుదురుగాక"— అన్నాడు.

చిత్రమేమిటంటే—అదే జరిగింది. బుద్ధుడు విగ్రహారాధన వద్దు అంటే—ఇవాళ బుద్ధుడి విగ్రహాలే మనకు కనబడతాయి అది మతంగా వచ్చింది.

మహనీయుల పేరిట వేర్వేరు "కల్ట్స్" పెట్టుకునే స్థితికి భారతీయులూ వచ్చారు. మాది మెహర్‌బాబా కల్ట్, మాది అరవింద కల్ట్ అంటారు. ఇలా— ధర్మంలోనికి ఇతరులను మేలుకొనవలసింది పోయి, ఏ ప్రభావంలోనో పడుతున్నాం

కనుక—క్రైస్తవ మతం పేరిట వచ్చిన వారికి ఇలా చెప్పాలి. క్రైస్తు అవతారమూర్తి. అతడు మనల్ని— వెలుగులోనికి రమ్మన్నాడు తప్ప, మతం పేరిట విడికొమ్మని చెప్పలేదు. అలా వారిని మేలుకొల్ప వలసిన బాధ్యత భారతీయుడి మీద ఉన్నది.

కణ్వుడి కల్ట్, భరద్వాజుడి కల్ట్, విశ్వామిత్రుడి కల్ట్ లేదు. అరవింద కల్ట్ మాత్రం ఎందుకుండాలి. మన జాడ్యం కాకపోతే? పరిపూర్ణ యోగమని ఆయన చెపుతాడా? మనం ఆయన ఫోటోలు తప్ప మరెవరిదీ పెట్టమా? ఎంత అన్యాయం! అది ఎప్పటికి పూర్ణం అవుతుంది?

ఇలా "డీవియేషన్" వస్తున్న వేళ ఇది మీరు మతం పెడితే-వారిని గురించి చెపుతారు తప్ప, వారి మీద గురి ఉంచి నడపలేరు. క్రైస్తు ఎలా దేవుడో నిరూపించడానికే మన సమావేశాలు సరిపోతాయి. క్రైస్తు చెప్పిన దేమి అని ఆలోచించే నిదానం, విధానం మనం కోల్పోతాం మతం పేరిట సంకుచితులం అయితే ఇదే జరుగుతుంది." కనుక మతస్థులకు సత్య దర్శనం అందడం కష్టం

కాగా శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచిపెట్టబోయే ముందు మైత్రేయునితో అంటాడు— అవతారం పరిసమాప్తి కాబోతున్నది. కార్యక్రమం తన రూపు మార్చుకుంటున్నది. ఇక పైన మంత్రజాల మార్గాన్ని నేను అనుష్టిస్తున్నాను. ప్రేమ మార్గాన మన జాతిని తరాల తరబడి మేలు కొలిపే ఒక దివ్య స్థితిని పాదుకొల్పుతున్నాను. దానికి నీ హృదయాన్ని సింహాసనంగా స్వీకరిస్తాను.

శ్రీకృష్ణుడు ఆ శరీరాన్ని విడిచి, మైత్రేయ మహర్షి హృదయాన్ని సింహాసనంగా స్వీకరించి, హిమాలయాలలోని శంబళ, కలాప గ్రామాలను తన కార్యకలాపాలకు కేంద్రంగా స్వీకరించాడు. "మళ్ళీ నేను దిగిరావడం ఎప్పుడోకాని జరగదు. కాని ఎప్పుడు దిగి వచ్చినా, పాడి పంట పశువుల మధ్య దిగివస్తాను—" అని చెప్పాడు. జీసస్ జీవితం పాడి పంట పశువుల మధ్య గడచింది. కృష్ణుడు జైలులో పుడితే, జీసస్ గొడ్లపాకలో పుట్టాడు. ఇద్దరూ భీతావహ వాతావరణంలో పుట్టారు. ఏసుప్రభువు పుట్టిన తర్వాత కూడా శిశువధ జరిగింది. ఇలా వారిద్దరి బాల్య సన్నివేశాలలో పోలికలు

అచ్చుగుద్దినట్లు కనబడతాయి. కృష్ణుడు గోవుల కాపరి. జీసస్ గొర్రెల కాపరి. ఇద్దరూ పశువుల కాపరులే.

ఏసుప్రభువు చివరి మూడు సంవత్సరాలు చేసిన బోధ భగవద్గీత సారం. భగవద్గీతను వెన్నతో తినిపించడమంటే ఏమిటో బైబిల్ చదివితే అర్థమవుతుంది. ఒకరకంగా—భగవద్గీత అర్థం కావాలంటే బైబిలు చదివి తీరాలి.

ఏసుప్రభువు దిగివచ్చిన ప్రాంతంలో ప్రజలు పరిణామ క్రమంలో శైశవ దశలో ఉన్నవారు కనుక—ఇక్కడ మహత్తరమైన జ్ఞానముగా వెదజల్లిన దానిని చిన్న చిన్న సన్నివేశాలుగా, కథలుగా, గాథలుగా ఉదాహరణలుగా ఆయన వాళ్ళకు మెదపి పెట్టాడు. చంటిపిల్లవాడికి చెప్పినట్లు.

"వెనుకకు మరలుడు. ఈశ్వర సామ్రాజ్యము వారిదే", ఏమిటీ సూత్రం? "ఇంద్రియాణి పరాణ్యాహుః..." అన్న గీతాశ్లోకం. ఇంద్రియాలు వాని వెనుక మనస్సు, ఆ వెనుక బుద్ధి ఆ వెనుక నీ స్వరూపం. ఇటు చూస్తే మానవుడు అటు చూస్తే దైవము

"ప్రయాసపడి భారము మోయుచున్న నరులారా! నా యొద్దకు రండు. విశ్రాంతి నిచ్చెదను". గీతలోని "సర్వధర్మాన్ పరిత్యజ్య..." శ్లోకానికి భాష్యం ఇది.

ఇంద్రియములవైపు మొగ్గిన మనస్సుకు లోకమంతా ఛిన్నాభిన్నంగా గోచరించి భయాందోళనలు కలుగుతాయి మనస్సు అటువైపునకు తిరిగి ఆయనను చేరినవేళ ఈ లోకమంతా తన స్వరూపమై, తానే లోకమంతా నిండిన దర్శనం కనిపిస్తుంది. కనుక పాపపుణ్యములకు అతీతమైన స్థితి వస్తుంది.

జీసస్ ఒక ఉదాహరణ చెప్పాడు. పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిన ఆడపిల్ల పుట్టింటికి వచ్చిన అన్నిటినీ ఆయన దృష్టితోనే చూస్తుంది. ఈ కలం బాగుంది. ఈ కోటు బాగుంది. ఈ కంచం బాగుంది. ఆయనకు ఇవ్వండి అంటుంది.

అలాగే, "నేను"ను రుచి చూసిన మనస్సు ఇంద్రియములలోపలికి వచ్చినా ఇందులో కూడ ఆయనకు పనికి వచ్చేది ఉంది అంటుంది. ఆయన గురించే ఆలోచిస్తుంది.

యోగ సాధనం మొత్తం ఇందులో ఉంది. రాజయోగ మార్గాన్ని ఎలా వెన్నతో మెదిపి పెట్టాడు. నిత్యజీవితంలోని ఉదాహరణ చూపి "తదర్థం కర్మకౌంతేయ," ఆయన కొరకు పని చేయడం అంటే ఇదే.

* * * *

... ఒకసారి ఏసుప్రభువును అడిగారు. తప్పులు చేసి బుద్ధి తెచ్చుకున్నవాడిని దేవుడు కరుణిస్తాడా అని.

ఆయన ఒక కథ చెప్పాడు. ఒక తండ్రికి ఇద్దరు కొడుకులు. పెద్ద కొడుకు తండ్రి క్రమశిక్షణ నచ్చక వేరుపడ్డాడు. పంచిన ఆస్తిని తగలేశాడు. శరీరం చెడిపోయింది. స్టేటస్ పోయింది. పందులను మేపే పనిలో చేరాడు. పశ్చాత్తాపం కలిగింది. తండ్రి విలువ తెలిసింది. ఇంటి ముఖం పట్టాడు. ఆ కబురు తెలిసిన తండ్రి పెద్ద ఉత్సవం ఏర్పాటు చేశాడు. అలంకరణలు. స్వాగతద్వారాలు. విందు. చిన్నకొడుకు పొలం నుంచి తిరిగివచ్చి అదంతా ఏమిటన్నాడు. 'చెడిపోయిన అన్న తిరిగి వచ్చిన సందర్భంగా'. 'బాగానే ఉన్న నాకేం,

లేదా ?' 'మనకు నిత్యం ఉత్సవమే కదా. నా మనస్సులోని ఉల్లాసం మీ అన్నయ్యకు అర్థం కావాలి. అందుకే ఇదంతా.' 'ఎన్ని తప్పులు చేసినా, ఎంతగా చెడిపోయినా, నిజస్థితి తెలుసుకొని నీ ప్రేమ నాకు కావాలి అని ఆర్తితో అడిగిన రోజున — అతడికి స్వాగత ద్వారం తెరుచుకుంటుంది.'

"అపిచేత్సు స్వదురాచారో భజమాం అనన్యభాక్" అన్న గీతా శ్లోకానికి భాష్యం ఈ కథ.

ప్రొజెక్టర్‌లో ఉన్న ఫిలిమ్ తెరమీద పడినట్లుగా, భగవద్గీతలో ఉన్న కొన్ని శ్లోకాల ఫిలిమ్ బైబిల్ అనే జీవిత గాథలుగా రూపు దిద్దుకుంది. ఆ ఫిలింను తెరమీద ఆడించి చూపిన ఆ ఏసు ప్రభువుకు జోహార్లు.

గీతలో మరో శ్లోకం ఉంది. అనన్యాస్ చింతయంతో మాం ... యోగక్షేమం వహామ్యహమ్. నన్ను నిత్యస్మరణ చేసేవారికి యోగం క్రమంగా ఉండేటట్లు నేను చూసుకుంటాను.

ఏసుప్రభువు జీవితంలో పూలమీద నడచిన రోజులున్నాయి. ముళ్ళమీద నడచిన రోజులున్నాయి. పూలు జల్లిన రోజులున్నాయి. ఉమ్మేసిన రోజులున్నాయి. పొర్లినా తీరని మంటలు శరీరంలో వచ్చిన వేళ ఆయన అంటాడు — "తండ్రీ, ఇదే నీ ఆజ్ఞ అయితే దీనినే జరగనీ. సన్మానాలు, తిరస్కారాలు ఉత్తముడుగా కీర్తిస్తున్న వేళ, శిలువ ఎక్కిస్తున్న వేళ — అనన్యాస్ చింతయంతో మాం అన్న శ్లోకాన్ని ఎనాక్ట్ చేసి, జీవితాన్ని దానికి సమర్పణ చేసిన ఏకైక మహనీయుడు అతడు. అనన్య చింతకు ఏసుక్రీస్తు జీవితంకన్న తార్కాణం మరొకటి లేదు.

ఆ తలుపులు తెరవండి. ఆ తలపులు వినండి. దేశాల సరి హద్దులు అడ్డురాకుండా భగవద్గీతా సందేశం ఎల్లెడలా ఎలా వెల్లివిరిసిందో కనులారా చూడండి. కృష్ణ శబ్దమ్ క్రైస్ట్‌గా రూపొందిందని మనం దర్శించగలుగుతాం.

ఏసుప్రభువు జీవితంలోని చివరి మూడు సంవత్సరాలలో బైబిలు గ్రంథం భగవద్గీత లోని కొన్ని ముఖ్య ఉపదేశాలకు చక్కని భాష్యమై భూమిపైకి దిగివచ్చింది. ఆ దేశ కాలాలకు అనుగుణమైన రీతిలో, ఆ జాతి పరిణామానికి అనుగుణమైన రీతిలో ఆయన చక్కగా, లీలగా, హేలగా వాటిని పంచిపెట్టాడు. వెన్నముద్దలు పంచిపెట్టిన స్ఫూర్తి అది.

మరొక్క సూక్ష్మం. రామానుజుడే జీసస్‌గా దిగి వచ్చాడు. కృష్ణుడు క్రైస్ట్‌గా ఆ జీసస్ నుంచి వ్యక్తమయ్యాడు చివరి మూడు సంవత్సరాలలో.

జీసస్ వేరు. క్రైస్ట్ వేరు. జీసస్ ఎవరినైతే నా తండ్రి అని చెప్పాడో అతడు క్రైస్ట్. ఆయన చరమ సందేశకాలంలో శ్రీకృష్ణుడు ఆయన శరీరమునందు వ్యక్తమై క్రైస్ట్‌గా సందేశాన్ని వెదజల్లాడు.

ఆ రెండు జీవితాలకూ ఉపమానం చూడండి.

రామానుజుడు ప్రజలందరికీ ఉపదేశం అందాలని గోపురమెక్కి ఘోషించాడు. మంత్రం చెపితే పాతాళానికి వెళ్ళిపోతావు అన్నారు 'నేనొక్కడిని పాతాళానికి వెళ్ళిపోయినా ఫరవాలేదు. కొన్ని లక్షల మందికి ఆ వెలుగు పంచిన చాలు'— అన్నాడు రామానుజుడు. గోపురం ఎక్కాడు. అక్కడ శిలువ ఎక్కినట్లు.

"త్రోసి వేయబడువాడు ధన్యుడు. అతడు దేవుని చెంతకు చేరు చున్నాడు"— అన్నాడు. ఏసు ధనుర్దాసు కథ ఏమిటి రామానుజుల జీవితంలో స్నానం చేసి వచ్చేటప్పుడు ఆ హరిజనుడి చేయి పట్టుకుని బయటకు వచ్చేవారు రామానుజులు. శిష్యులకు ఒళ్ళు మంట. గురువుగారికి ఇంత సంస్కరణాభిలాష ఉండడం మంచిది కాదు అనుకున్నారు.

రామానుజుల జీవితంలో ఏ అట్టడుగు ప్రజల ఉద్ధరణ కొనసాగా లన్న తపన, దీక్ష కొనసాగిందో అదే దీక్ష జీసస్ జీవితంగా అక్కడ వ్యక్తమైనది.

రెండవది 'నీ వెవరవు? దేవుని పుత్రుడను' మరొక చోట "నేను నా తండ్రీ ఒక్కటే". అయామ్ దట్ అయామ్. ఇది విశిష్టాద్వైతం. దేవుడికీ జీవుడికీ ఎలాంటి సంబంధం ఉన్నదని రామానుజాచార్యులు ప్రతిష్ఠ చేశారో దానిని అక్కడ తన జీవితంలో వర్తింపజేసి చూపించినవాడు జీసస్ మహాశయుడు.

ఆ హరిజనుడికి ఆలయ ప్రవేశం ఇవ్వాలా వద్దా అని ఆలోచిస్తున్న అభ్యుదయ కాలం మనది. మంత్రం బయటకు అనవచ్చునా అని గొణు క్కొంటున్న కాలం మనది.

కాగా ఆ జీసస్ చిరంజీవి ఇప్పటికీ హిమాలయాలలోని శంబళ, కలాప గ్రామాలలో చక్కగా ఉన్నారాయన.

సూర్యునినుంచి ఏడు కిరణాలు వ్యక్తమవుతూ ఉంటాయి. వాటికి సంబంధించిన ఏడు తరహాల ప్రజలు భూమిమీద వర్తిస్తూ ఉంటారు. ఏడు

కిరణాలు ఏడు విధములైన డ్యూటీలు నిర్వర్తిస్తూ ఉంటాయి. అందులో ఒక కిరణానికి ప్రతినిధి ఏసు ప్రభువు. సమస్త సేవా కార్యక్రమాలకు అధిపతి ఆయన. సమస్త వైద్య శాస్త్రములకు ఆధ్వర్యం వహిస్తున్న మాస్టర్‌గా, పరమ గురువుగా ఆ జీసస్ పని చేస్తున్నారు.

మనం ఈ సమన్వయాన్ని దర్శించాలి. మతం పేరిట కన్ను మూసుకోవడం కాదు. ధర్మం పేరిట కన్ను విప్పుకోవాలి. ఆ మహనీయుని జ్ఞాన బోధ, జ్ఞాన గంగ ఆగకూడదు. మతం పేరిట దానిని మైలపరచవద్దు. ధర్మం పేరిట దానిని ఆరాధించండి. మతం పేరిట మూఢత్వాన్ని పొందకండి. ధర్మం పేరిట గాఢత్వాన్ని పొందండి.

(25-12-88న విజయవాడ శారదా కళాశాలలో క్రిస్మస్ ఉత్సవ సందర్భంగా చేసిన ప్రసంగం సారాంశం.)

# మానవతా మంత్రం

ప్రకృతిని మనం చక్కగా అర్థం చేసుకుంటే విజ్ఞానశాస్త్రం పుడుతుంది. ఆ ప్రకృతిలో వున్న ధర్మాలను గ్రహించితే మనలో వివేకం జన్మిస్తుంది. విజ్ఞానం, వివేకం రెండూ చేతులు కలిపి నడిచిన వేళ మానవ జాతికి శాంతి, సౌఖ్యం కలుగుతున్నాయి. విజ్ఞానం పెరిగి వివేకం తరిగిన రోజున అశాంతి, విధ్వంసం తాండవిస్తాయి.

సృష్టిలో ఒక చిత్రం కనిపిస్తున్నది. ఖనిజాలు ఆహారంగా వృక్షాలు పుట్టుకు వస్తున్నాయి. ఆ వృక్షాలను తింటూ జంతువులు బ్రతుకుతున్నాయి. ఆ రెంటినీ వినియోగించుకుని మనిషి బ్రతుకుతున్నాడు. అయితే- ఒక చెట్టు మరో చెట్టును తినదు. ఒక జంతువు తన జాతి జంతువును తినదు. మనిషి మాత్రం తోడి మనిషిని అనుమానించగలడు, అవమానించగలడు, హింసించగలడు, దూషించగలడు, ద్వేషించగలడు, తినగలిగిన స్థితికి వచ్చాడు.

ఈ వేళ అదేకదా భయం. ఒక దేశాన్ని చూస్తే మరో దేశానికి ఎందుకంత భయం? ఎందుకింత అశాంతి? ఎందుకిన్ని అణ్వస్త్రాలు? కోట్లాది ప్రజలు అన్నవస్త్రాలకు నోచుకోని స్థితిలో ఈ అణ్వస్త్రాలు ఏమిటి? ఒకడి మీద మరొకడికి నమ్మకంలేని ఆక్రమణ కాంక్షతో మానవత్వం వక్రించిన వేళ ఇది. విధ్వంసానికి దారితీస్తున్న వేళ ఇది.

కులమతాలు పేరిట, ఆర్థిక తారతమ్యాల పేరిట, చివరికి రంగు పేరిట పీడించే వాళ్ళు కనబడుతున్నారు. చదువుకున్న వాడికి చదువుకోని వాడు పామరుడు. రిక్షావాడిని రిక్షాలో భాగంగా మనం చూడగలం.

మరి, వీళ్లను కలిపి నిలపడం ఎలా? వీళ్ళ మధ్య ఏకత్వ దర్శనం ఎలా కలుగుతుంది?

ఋషులు తపస్సు చేసి సాధించిన దర్శనం ఒక్కటే అనుసరణీయం.

ఒక శక్తి అనేది పనులు చేయడానికి అనేక అవయవాలుగా రూపొందింది మానవ దేహంలో. కాలులో ముల్లు విరిగితే కన్ను ఏడుస్తున్నది. అలాగే సమాజమనే శరీరంలో మనమందరం భాగాలమై ఉన్నాం. అందులోనే మనందరికీ సార్థకత ఉన్నది. సమాజంలో చెప్పులుకుట్టే వ్యక్తి అవసరమే. గుడిలో తీర్థం ఇచ్చే వ్యక్తి అవసరమే.

ఈ అంగరాజ్యం నుండి రాజ్యాంగం రూపుదిద్దుకున్నది. వివిధ వృత్తులు వివిధ పాలకులై సేవిస్తూ ఉండగా సమాజమనే శరీరం ఆరోగ్యవంతంగా వర్ధిల్లుతుంది.

సమాజంలో ప్రతి వ్యక్తికీ ఒక అదృష్టం వున్నది. కర్తవ్యం ఉన్నది. అతడు మాత్రమే చేయగలిగిన పని వున్నది. మన పెద్దలు ఒక క్రతువులో చెపుతారు కదా. మేము ఒక దేవాలయాన్ని నిర్మిస్తున్నాము. మీవంతు రాయిని మీరు ఇవ్వాలి. లేకపోతే, ఆ రాయి మేరకు ఈ గుడి నిర్మాణం మిగిలిపోతుంది.

ప్రతి జీవితానికి ఒక ప్రయోజనం, పరమార్థం ఉన్నది. అతడు దానియెడల మేల్కొనాలి, దానిని సాధించాలి.

ఈ దివ్య సందేశం ఈ గడ్డ నుండి వెలువడింది.

ఒక మనిషి మరొక మనిషిని ఆరాధించాలి. ఒక జాతి మరొక జాతిని ఆరాధించాలి. అపుడు పోటీపడే స్వభావం పోయి సహకరించుకునే స్థితి వస్తుంది. ఆ సహకారం లేకపోతే స్వాహా చేయడం మిగులుతుంది. అణ్వస్త్రాలు మనలను లేకుండా చేస్తాయి.

అయితే– పెరుగుట విరుగుట కొరకే. అణ్వస్త్రాలు వచ్చాయి. అవి వాడితే ఎవరూ మిగలరనే ప్రచారం జరిగే సరికి– మనిషిలో శాంతియెడల ఇచ్ఛ కలిగింది. యుద్ధ నివారణ కృషి మొదలైంది. కనుక ఆ అణ్వస్త్రం అనే ప్రజ్ఞకు నేను నమస్కరిస్తున్నాను.

కాగా మనిషి ఈ సృష్టిని ఎలా చూడాలి. దానితో ఎలా అనుసంధానం ఏర్పరచుకోవాలి అన్నది ఒక శాస్త్రం. ఆ మానవ ధర్మం ఈ గడ్డమీద వెల్లివిరిసింది.

'ఓ ప్రభుత్వమా! నిన్ను ఎన్నుకున్నది యుద్ధం కోసం కాదు. శాంతి కోసం–' అని నేడు ఫ్రాన్సులో, ఇటలీలో వాల్‌పోస్టర్లు వేస్తున్నారు ప్రజలు. ఈ చైతన్యం ఎలా వచ్చింది?

వారికి వివేకానందుని వాణి, శివానందుని వాణి వినపడింది. ఇవాళ పాశ్చాత్య దేశాలలో శివానంద పేరు హెచ్చుగా వినపడుతున్నది. మనకు మాత్రం ఆ స్వామి శివానంద ఎవరో తెలియదు.

ఇవాళ ఫ్రాన్సులో అరవింద యోగి సూక్తులు, అరవింద మదర్ సూక్తులు ఉన్న చిన్న చిన్న గ్రంథాలు ఇంటింటా టీపాయ్‌ల మీద కనబడుతున్నాయి. వారు వాటిని చదువుతూ ఉంటారు. మనం వీక్లీలు చదువుతున్నట్లు.

కాని మనకు అరవిందయోగి గుర్తుకు రారు. ఆగష్టు 15 అరవింద జన్మదినమని, నేను పుట్టిన రోజున నా దేశమాత సంకెళ్లను ఛేదిస్తానని ఆయన ప్రతిజ్ఞ చేశారని, ఆయన సంకల్పసిద్ధితో ఆయన పుట్టిన రోజున దేశమాతకు స్వాతంత్ర్యం వచ్చిందని మనలో ఎందరికి తెలుసు?

మరో ప్రక్క మహర్షి మహేష్ యోగి అష్టాంగయోగ మార్గంలో ధారణ అనే దివ్య స్థితి వరకు శాస్త్రీయంగా వివరణచేసి యోగ విద్యను పంచిపెడుతూ లక్షల మందిని తర్ఫీదు చేసి, వారిని శాంతి కాముకులుగా రూపొందిస్తున్న శుభ ఘడియలు ఇవి.

మన దేశమాత ప్రపంచ శాంతికి అందిస్తున్న కానుకలు ఇవన్నీ.

ఇవాళ ఫ్రాన్సున గ్రామ గ్రామాన యోగా స్కూల్స్ నడుస్తున్నాయి. పాశ్చాత్య దేశాలలో అనేక విశ్వవిద్యాలయాలలో సంస్కృత శాఖ ఉంటున్నది. అక్కడ పావనమైన పరిశోధనలు జరుగుతున్నాయి. కాని, మన విశ్వవిద్యాలయాలలో సంస్కృతం నామమాత్రంగా ఉంటున్నది. అసలు ప్రపంచం ఏ పాత్రపోషణను మనసుంచి అడుగుతున్నదో, దానిలో మనం

వెనుకబడి ఉన్నాం. ఆర్థికంగా వెనుక బడ్డాం అని బిచ్చగాళ్లమై అడుక్కో వలసిన స్థితి ఏమిటి మనకు? మన పాత్రను, పాత్రతను మనం పోషించిన రోజున మనకు కావలసినవి మనవద్దకే నడచివస్తాయి.

కనుక—ఓ భారతీయుడా! నీవు శాస్త్రజ్ఞుడవు కా. ఉద్యోగివి కా. డబ్బు పేరు ప్రతిష్ఠలూ సంపాదించు. కాని, మొదట భారతీయుడుగా ఉండడం మాత్రం మరువకు.

మరొక్క మాట. మనస్సు హృదయము నందు కరగిన వేళ, హృదయం ఎత్తు ఎదిగిన మానవుడు ఈ విశ్వాంతర్యామియై వర్థిల్లుతాడని భారతీయ ధర్మశాస్త్రం అనుభవ పూర్వకంగా ఉపదేశిస్తున్నది. సంకల్పసిద్ధికి మించినది లేదు.

ప్రపంచ శాంతి విజృంభించే దశాబ్దంగా 1990—2000 దశాబ్దం నడుస్తుంది. విశ్వమానవ సౌభ్రాతృత్వానికి కావలసిన మంచి పనులు అపుడు జరుగుతాయి.

మానవుల అందరం ఒకే దివ్యత్వం నుండి దిగివచ్చిన సంతతి అని గుర్తుచేసిన వివేకానందుని శంఖారావం ఆగలేదు. పనిచేస్తూనే ఉన్నది. రష్యాలో కూడా ఒకావిడ పుట్టింది. హెలినా పెట్రోవాబ్లావెడ్‌స్కీ. ఆవిడ ప్రపంచ తత్వశాస్త్రముల మధ్య సమన్వయాన్ని దర్శింపజేస్తూ గ్రంధాలు రచించింది. హిమాలయ గుహలలో, శంబళ, కలాప గ్రామాలలో అవతార మూర్తులు, మహర్షులు ఇన్ని యుగాలుగా కథలు నడిపిస్తున్నారనీ, ప్రపంచ శాంతికి కేంద్రం ఆ గ్రామాల్లో ఉన్నదనీ ఆమె చెప్పిన రోజున ప్రపంచ

నిర్వీర్యమైపోయింది. ఆది శంకరులు, రామానుజులు, మధ్వాచార్యుడు, జీసస్ మహమ్మద్ అందరూ ఆ గ్రూప్‌లోని వారేనని ఆమె ప్రకటించింది. ఆ గ్రంథాలు పాఠ్య గ్రంథాలు అయితే, ప్రపంచ ఒకటవుతుంది. ఐక్యరాజ్య సమితికి మూలసూత్రం లభిస్తుంది, దానికి స్థిమితత్వం చేకూరుతుంది.

విజయవాడ లయన్స్ క్లబ్‌లో ఇటీవల శ్రీ మోపిదేవి కృష్ణస్వామి ఇచ్చిన ప్రసంగ సారాంశం ఇది.

[ఐక్యరాజ్య సమితి జన్మదిన సందర్భంగా విజయవాడ లైన్స్ క్లబ్‌లో చేసిన ప్రవచన సారాంశం]

# అంతరంగ అభిషేకం

మనకు రెండు సంప్రదాయాలు ఉన్నాయి. ఒకటి సృష్టి దిగివస్తున్న వేళ దేవుడు ధరించిన రూపాల సంప్రదాయం. విష్ణువు, రుద్రుడు, నారాయణుడు, కుమారుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు– వీరంతా సృష్టి నిర్మాణానికి అధ్యక్షత వహిస్తున్న దేవుని రూపాలు. రెండవది. సృష్టి వ్యక్తమైన తర్వాత భూమిమీద మానవుల మధ్య ధర్మసంస్థాపన కోసం దేవుడు మానవుడుగా దిగివచ్చే సంప్రదాయం. ఒకటి దేవతా సంప్రదాయం, మరొకటి అవతార సంప్రదాయం. రెండూ ఏకకాలంలో నడుస్తూ ఉంటాయి.

మానవుడి మనస్సుకూ, సృష్టిలో ఉన్న ధర్మానికీ అనుసంధానం దేవుడు. అవతార మూర్తి, ఎప్పుడెప్పుడు మానవుడు ధర్మాన్ని మరుస్తాడో ధర్మంకన్న రాగద్వేషాలు ఎక్కువవుతాయో, ధర్మంకన్న ఆచారకాండలు ఎక్కువవుతాయో–అప్పుడప్పుడు అతడు దిగివచ్చి తన దివ్యమోహన రూపంతో, వాక్కుతో, స్పర్శతో మానవులలో మళ్లీ ధర్మాన్ని ప్రతిష్ట చేస్తాడు. ఇది ఒక దేశానికీ, కాలానికీ చెందినది కాదు. సృష్టి ప్రణాళికకు చెందినది.

శివరాత్రి సందర్భంగా వేదాలలో దేవతల మధ్య అనుసంధానం ఎలా ఉన్నదో పరిశీలిద్దాం.

సృష్టికి దైవము ఉన్ముఖుడైన వేళ, ఆయన మూడు స్థితులలో వ్యక్తమవుతాడు. ద్వాదశ ఆదిత్యులుగా ఏకాదశ రుద్రులుగా, అష్టవసువులుగా. అనగా ప్రజ్ఞామయముగా, స్పందనమయముగా, పదార్థమయముగా, సువర్‌లోకము. భువర్‌లోకము, భూలోకముగా ఇక్కడ నుండి

చూస్తే-భూర్ భువః సువః గాడ్స్ ఆఫ్ రేడియేషన్, నైబ్రేషన్ మెటీరియలైజేషన్.

మనలో కూడా మూడు లోకములు ఉన్నాయి. దేహము పదార్థమయ లోకము భూలోకము. దేహాన్ని కదిలించే ప్రాణశక్తి భువర్ లోకము. ఆ ప్రాణమును ఆజ్ఞాపించు ప్రజ్ఞ సువర్ లోకము. పదార్థము, ప్రాణము, ప్రజ్ఞ, మేటర్, ఫోర్స్, కాన్షస్‌నెస్. భూర్భువస్సువః ఈ శాస్త్రీయ విద్యలోనికి మానవుడు మేలుకోవాలి. దానికి భారతీయుడు నాంది పలకాలి.

"ఏతాస్త్రి శ్రోవ్యా హృతయః" ఈ మూడు లోకములు నాయందు ఉన్నాయి. ఈ మూడు లోకములుగా నీవే వ్యక్తమగుచున్నావు.

నారదుడు త్రిలోక సంచారి- అంటే అర్థం ఇదే.

ఆధునిక మానవునికి ఈ ఆధ్యాత్మిక విద్య ఎందుకు అందడం లేదు? ఈ శరీరాన్ని పోషించడం ఎలా అనే భ్రమలో భయంలో పడి అతడు కొట్టుకుంటున్నాడు కనుక. అలా కాక- ఏ పాత్ర పోషణకు, ఏ కర్తవ్యానికి ఈ శరీరం ఇవ్వబడిందో గ్రహించిన వేళ మనకు కావలసింది మన వద్దకు నడచివస్తుంది. అన్నపానముల కోసం వెదుక్కోవడం నీకు గొప్ప అవమానం.

కనుక తిరగబడాలి. మన జీవితం తిరగబడాలి. ఎవరి మీదనో కాదు. తిరిగి దారిలో పడాలి.

ఈ దృష్టితో ఆ రుద్రమూర్తిని భావన చేయాలి. ఆ రుద్రాధ్యాయాన్ని మనకు అందించిన వేదఋషులు ఎంత అందంగా, ఎంత ఆనందంగా చెప్పారు! ఎంత సౌందర్యాన్ని అందులో చూపారు!

ఓ రుద్రుడా. నీ విల్లు బాణములు మాకు శుభం కలిగించాలి. సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఆకాశ మార్గంగా వ్యక్తమవుతున్న సూర్యుని గమనపథమనే ఎక్కు పెట్టిన విల్లు ఒకటి ఉన్నది. ఆ విల్లు ఎక్కుపెట్టడం వల్లనే ఈ సృష్టి నిలబడి ఉన్నది. 'నమస్తామ్రాయచ అరుణాయచ' ఎక్కు పెట్టబడిన విల్లు రూపంలో తామ్రవర్ణం కలిగిన ఉన్నావు. అస్తమిస్తున్న సమయంలో అరుణ వర్ణం కలిగి ఉన్నావు. మాలోనూ ఒక విల్లు ఉన్నది. చిన్న విల్లు. కనుబొమల నుండి వెనుకకు వెళ్ళిన విల్లు, మనస్సు, ఇంద్రియములు బాణములై నీరూపములై వ్యక్తమవుతున్నాయి. సృష్టి ఉత్సవానికి ఆ విల్లు ఎక్కుపెట్టావు. ఈ జీవిత ఉత్సవానికి ఈ విల్లు ఎక్కు పెట్టావు. కనుక నీ విల్లు, బాణములు మాకు శుభం కలిగించాలి. నీకు కోపం కలుగకుండా జీవించే అదృష్టం మాకు కలగాలి.

మనిషి పొట్ట నింపుకునేది దేనికి? నాలుక రుచికోసమా? జీవించడం కోసమా? ఒక రోజున పెసర పచ్చడి ఒక్క ముద్ద ఎక్కువ తింటే ఆ రుద్రుని శూలం ఒక్కపోటు పొడుస్తుంది. ఏమాత్రం తప్పు చేసిన. అక్కడికక్కడే గుణపాఠం చెప్పే నీ విల్లు ఉన్నది. నీ బాణం ఉన్నది. ప్రభూ! ధర్మాన్ని అతిక్రమించే బుద్ధి మాకు లేకుండా చూడు.

ప్రేమ తిరగబడితే కోపం అవుతుంది. బిడ్డ తప్పుచేస్తే నాన్న కోపపడతాడు, ప్రేమ ఉన్నది. కనుక.

రుద్రాధ్యాయంలో ఇంకా అంటున్నాడు ఋషి. ఈ సృష్టిలో ఇన్ని రూపాలుగా వ్యక్తం అవుతున్నావు. ఎన్ని రూపాలు ఎన్ని అందాలు! ఎన్ని చందాలు! ఈ లతలు నీ జందాలు! ఈ పూలు నీవు కట్టుకున్న పట్టుబట్టపై అల్లిన డిజైన్లు.

నీవు జీవరాసులుగా వ్యక్తం అయినావు. వాటి ఆహారముగా, జీర్ణ ప్రక్రియగా వ్యక్తం అయినావు. ఆ మూర్తులకు నమస్కారిస్తున్నాను.

ఇలా రుద్రాధ్యాయం అనుభూతి ప్రధానంగా మహావైభవోపేతంగా సాగిపోతుంది.

మరో చోట అంటాడు. మా పెద్దలకు, చిన్నలకు యోగక్షేమం చక్కగా ఉండేటట్లు చూడు. మానవుడికి భగవంతునితో అనుసంధానం యోగం. అది ఉన్నంతవరకు అతడికి క్షేమమే. అది గతి తప్పితే క్షామమే. మానవుని దేహ భాగాలన్నీ వెలగాలంటే దేవుడితో కనెక్షన్ బాగా ఉండాలి. ఆ కరెంట్ అక్కడ నుంచి రావాలి. ఆ కనెక్షన్ తెగిపోతే అంతా చీకటే.

మరో చోట అంటాడు. నీవు పైన కొన్ని చప్పుళ్ళు చేస్తున్నావు మా కోసం. ఉచ్చైర్ ఘోషాయాక్రందయతే ఉరుములు మెరపులు, పిడుగులు, మాకోసం వర్షం కోసం మేము క్రింది నుండి కొన్ని చప్పుళ్లు చేస్తున్నాం. ఆక్రందనలు చేస్తున్నాం. ఆయన అంటున్నాడు ఆ చప్పుళ్ళని ఈచప్పుళ్లు కలిపి గుట్టుచప్పుడు కాకుండా ఈ సృష్టిని నేను నడుపుతాను అని నీ ఆక్రందల మధ్య నుండి ఆగకుండ నీ ప్రయాణాన్ని చూచేవాడిని నేను అని, గతితప్పితే ఆక్రందన వస్తుంది. ఆక్రందన వచ్చినప్పుడు కూడా నేను విడవను. తగిన ఫలం ఇచ్చి బుద్ధి తెప్పించి తిరిగి పట్టాలు ఎక్కిస్తాను. ఆక్రంధన్ని తిరిగి పట్టాలు ఎక్కేందుకే నీవు యోగాన్ని పోగొట్టుకున్న వేళ, ఆక్రందన వచ్చిన వేళ నిన్ను మళ్ళీ నా దగ్గరకు లాగికొంటాను.

ఇంకా అంటాడు-శరీరముల రూపమున ఉన్న నీకు నమస్కారం. శరీరములను తయారుచేస్తున్న నీకు నమస్కారం. శరీరాలను ధరించే జీవతత్వ రూపంలో ఉన్న నీకు నమస్కారం. శరీరములకు, జీవులకు అధిపతిగా ఉన్న నీకు నమస్కారం. అనగా ఈ శరీరాలను మనం

పవిత్రంగా చూచుకోవాలి. ఇది రథం! దీని రూపంలో ఉన్నది ఆయనే! 'రథికా రేభ్య!' ఇన్నెన్ని రూపాలలో మనకోసం ఎంత ఇంజనీరింగ్ వ్యక్తం చేస్తున్నాడు! ఆ వైభవలేశం వ్యక్తమైతే మనం ఇంజనీర్లం అవుతున్నాం. డాక్టర్లం అవుతున్నాం. ఆ తర్వాత ఇంత సైన్సు చదివి ఇంకా దేవుడంటా రేమిటి అంటున్నాం. ఉద్యోగం వచ్చిన తర్వాత అమ్మా నాన్న ఎందుకు అన్నట్లు.

కాగా మనకు జ్ఞానేంద్రియములు5 కర్మేంద్రియములు5. మనస్సుతో కలిపి మొత్తం 11. ఇలా మనలో 11 రుద్రమూర్తులు. పైన 11 రుద్ర మూర్తులు. ఏకాదశరుద్రులు.

మన మనస్సు ఇంద్రియముల వైపు మొగ్గిన వేళ అతి ఇంద్రుడు అవుతున్నది. బుద్ధివైపు మొగ్గిన వేళ రుద్రుడు అవుతున్నది. ఇంద్రియములు, మనస్సు కలిసి వివేకాన్ని స్వీకరించిన వేళ-అక్కడ దివ్యశక్తుల వర్షంతో జరిగే అనుభూతి ప్రదమైన అభిషేకమే నిజమైన రుద్రాభిషేకం.

సమస్సోమాయచ రుద్రాయచ ఓ రుద్రుడా, ఈ జీవితాన్ని రుద్రాభిషేకంగా రుద్రవైభవంగా రూపొందింతువు గాక. నా జీవితమే ఒక రుద్రాధ్యాయం అగును గాక.

[4-3-89న శివరాత్రి సందర్భంగా విజయవాడ శివరామక్షేత్రంలో చేసిన ప్రవచన సారాంశం]

—:o:—